

కోటి విద్యలు

చిత్రకారుడు : నక్కల మునుస్వామి.



అపరంజి బొమ్మ హొయలు।

కురవంజి నృత్యలయలు।

బేలూరు శిల్పం. ఫొటో: వి. కేశవశర్మ

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 8
24-10-56

దుర్ముఖ ఆశ్వయుజ బహుళ పంచమి బుధవారం

## విషయానుక్రమణిక



## ★ ఒకమాట ★


"ఫణి" రచయిత

ఈవారం సంచికతో ఆఖరైన సీరియల్ నాటకం 'ఫణి' రచయిత శ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తి 1927 (ప్రభవ, కృష్ణాష్టమి నాడు) లో తెనాలి తాలూకా, అనంతవరంలో జన్మించారు తల్లి కీ॥ శే॥ సుగంధికుంతలాంబ తండ్రి శ్రీ విశ్వనాథం. వీరిది విద్వత్కుటుంబం. అమ్మ, అన్నలు కవిత్వం చెప్ప నేర్చిన వారు మేనమామ శ్రీ పెద్దిబొట్ల చలపతిరావు. శ్రీ రామమూర్తి గారికి చిన్నప్పటినుంచీ నాటకాలంటే ఆసక్తి. మేనమామ పోలిక కావచ్చు

సరిగా ఊహ తెలిసి రోజుల్లో ఆ యీడుకు తగ్గటు 'చండిక', 'చంద్రగుప్త' వ్రాసి వాటిల్లో టైటిల్ రోల్సు వేయడం జరిగింది

1945 లో 'వరూధిని' నాటక రచనా ప్రయత్నంలో ఇంటర్ మీడియేట్ పరీక్షలకు అంతరాయం కలిగి రెండు భాగాల్లో మాత్రం కృతార్థత లభించింది. అటు ఆనాటకమూ పూర్తి కాలేదు

1948 లో కొందరు ఔత్సాహికులతో కలిసి విజయవాడలో 'శ్రీ నవ్యకళా మండలి'ని స్థాపించడంతో ఆ నాటకరంగాసక్తి ఓ రూపం ధరించింది

తొలుదొల్తగా ప్రేక్షకులకు పరిచయమైన నాటిక 'జనవరి ముప్పయ్' ఆతర్వాత 'కాళరాత్రి' నాటకం ముందు 'ఆంధ్రవారపత్రిక' ద్వారా పాఠకులకు పరిచయమై, తర్వాత గత సంవత్సరం అక్టోబరులో హైదరాబాదులో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీలలో శ్రీకాకుళం శ్రీ నటరాజ కళాసమితివారిచే ప్రదర్శింపబడి ఉత్తమ ప్రదర్శనకు అగ్రతాంబూలం అందుకుంది.

నాటకాల ఇతివృత్తాల విషయంలో వీరిదొక ప్రత్యేకమైన అభిరుచి ప్రేక్షకుల మన్మిశ్రమైన ఉద్రేకాలను సబ్బునీటి బుడగల్లా పొంగించి చూస్తున్నంత సేపూ కన్నీళ్లు పొలికించి చప్పట్లు కొట్టించుకోవడం కాదు నాటకాల పని—'వేదవాదోద్యాయమాన మానసులు' అంటారు చూడండి—అలా తయారు చెయ్యాలి ప్రేక్షకుల్ని నాటకాలు సమష్టి సమాజ సంస్కారాపేక్ష కొవాడను నాటి లక్ష్యం—ప్రత్యేకంగా ప్రతి వ్యక్తి అంతస్సంస్కారమూ నాటి లక్ష్యం కావాలి నాటకాలు ప్రేక్షకుల ఉద్రేకాలను కాదు రెచ్చగొట్టాల్సింది—వారి ఆలోచనలను రేకెత్తించాలి—ఇదీ వీరి వాదం వీరి ఇతర రచనలు 'దయ్యం' వ్యంగ్యనాటిక, 'ముళ్ల గులాబీలు' (జె బి ప్రీస్ట్లీ నాటకానికి అనుసరణ) 'నవజీవనం' పేరిట టాల్స్టాయ్ 'రిసరెక్షన్' అనువాద



గుంటూరు రైలుస్టేషన్‌లో కొత్తగా నిర్మించిన మూడవతరగతి ప్రయాణీకుల విశ్రాంతి మందిరం, బుకింగ్ ఆఫీసు

# నాయకత్వానికి తీవ్రమైన పోటీ

ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ సుముహూర్తం సమీపిస్తున్నది కొత్త ఆంధ్ర రాష్ట్రానికి ముఖ్యమంత్రి కావలసిన కాంగ్రెస్ నాయకుడిని ఎన్నుకునే రోజు కూడా దగ్గరకొచ్చింది పాఠకులకు ఈ సంచిక అందేసరికి నాయకుని ఎన్నికకు రెండుమూడు రోజులకంటే ఎక్కువ వ్యవధి వుండదు

ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెసు సభ్యులు 198 మందీ వచ్చే ఆదివారంనాడు సాయంత్రం 4 గంటలకు కర్నూలులో నాయకుని యెన్నికకోసం సమావేశమవుతున్నారు తెలంగాణా జిల్లాలకు చెందిన 51 మందీ ఇప్పటి ఆంధ్రరాష్ట్రానికి చెందిన 147 మందీ కాంగ్రెస్ సభ్యులు ఈ సమావేశములో పాల్గొంటారు వీరందరికీ ఆహ్వానాలు సైతం పంపించారు

మొదట ఉత్సాహపడి ముందుకు వచ్చినప్పటికీ శ్రీ ఎన్. జి. రంగా గత మాసాంతాన కర్నూలులో జరిగిన చర్చల ఫలితంగా తాము నాయకత్వానికి జరిగే పోటీలో పాల్గొనబోవడంలేదని ప్రకటించారు. ఇంతేగాక తమ అనుచరులందరూ శ్రీ గోపాలరెడ్డిగారినే బలపరుస్తారనికూడా తెలియజేశారు.

హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు మొదటినుంచీ, ఎన్నిక ఏకగ్రీవంగా జరగాలనీ, నాయకుడుగా ఎన్నికైన వ్యక్తి పూర్తిగా ఐదేళ్ళపాటూ వుండాలనీ, నాయకత్వంకోసం జరిగే పోటీలో పాల్గొనే ఉద్దేశం తమకు లేదనీ స్పష్టపరుస్తూనే వచ్చారు

ప్రస్తుతానికి ఎవరిని ఎన్నుకున్నప్పటికీ వచ్చే ఫిబ్రవరిలో తెలంగాణా జిల్లాలో ఆంధ్రప్రదేశ్ శాసనసభకు, పార్లమెంటుకు ఎన్నికలు జరగగానే, తిరిగి నాయకుని ఎన్నిక అవసరమవుతుందనే భావం ఏర్పడింది. ఈ కారణంచేతే, మొదటి ఆరునెలలపాటు శ్రీ గోపాలరెడ్డి నాయకత్వాన్ని తాము బలపరిచేట్లు, అనంతరం నాయకత్వానికి జరిగే ఎన్నికలో తమను శ్రీ గోపాలరెడ్డి బృందం బలపరిచేట్లు శ్రీ రంగా లోపాయికారీగా ఒక ఏర్పాటు చేసుకున్నారనే వదంతికూడా పొక్కింది. వీటన్నిటివల్లా వచ్చే సోమవారంనాడు పోటీ శ్రీ గోపాలరెడ్డికీ, శ్రీ సంజీవరెడ్డికీ మాత్రమే పరిమితమైంది

నాయకుని ఎన్నిక విషయంలో ఈవిధంగా కీచులాడుకోవడం భావ్యంకాదనీ, ఎన్నిక ఏకగ్రీవంగా జరగడం శ్రేయస్కరమనీ కాంగ్రెస్ అధిష్ఠానవర్గం అభిప్రాయపడుతున్నది తమను చూడడానికి వెళ్ళిన ఆంధ్ర నాయకులకు ఇదే సలహా ఇస్తున్నది; పోటీ చేయబోతున్న అభ్యర్థులకు వారిద్వారా ఈ సలహానే అందజేస్తున్నది, సంతకాల సేకరణ మొదలైన తతంగాన్ని నిరసిస్తున్నట్లుకూడా స్పష్టపరుస్తున్నది "ఆంధ్రప్రదేశ్ నాయకత్వం విషయంలో కాంగ్రెస్ అధిష్ఠానవర్గం ఏవిధమైన జోక్యం కల్పించుకోదు గాని, ఎన్నిక ఏకగ్రీవంగా జరిగితే చాలా సంతోషిసుంది. పోటీ జరిగే ముందురోజున (అక్టోబరు 20 న) అభ్యర్థులు ఎవరిబలం ఎంతో మదింపువేసుకోగలుగుతారు కాబట్టి, తక్కువ బలం గలవారు పోటీనుంచి తప్పుకొని, ప్రత్యర్థి పేరునే ప్రతిపాదించి ఏకగ్రీవమైన ఎన్నికకు సహాయ పడవచ్చునని అధిష్ఠానవర్గం అభిప్రాయపడుతున్నది," అని ఇటీవల ఢిల్లీలో చర్చలు జరిపి వచ్చిన పిమ్మట హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ ప్రకటన చేశారు.

కోడలు కొడుకును కంటానంటే ఏ అత్త

# సాహితీమూర్తి: సంగీతనిధి

ఒక సాహితీమూర్తిని, సంగీతనిధినీ సత్కరించి, ఆంధ్రమహాసభవారు ఈ నెల 14 న సరస్వతీపూజ జరిపారు

శ్రీ కొండి వెంకటరామమూర్తిగారు అధ్యక్షత వహించారు సన్మానితులలో సాహితీమూర్తి, కవి కాటూరి వెంకటేశ్వర రావుగారు రెండవవారు ప్రసిద్ధ సంగీత శాస్త్రజ్ఞులు ఆచార్య సాంబమూర్తి

## నాయకత్వానికి పోటీ

అయినా వద్దంటుందా? ఏకగ్రీవంగా ఎన్నిక జరిగే అవకాశం వుంటే అవశ్యం జరగవలసిందే జరిగితే తప్పక అందరూ హర్షిస్తారు అయితే, అది ఎంతవరకు సాధ్యమన్నదే ప్రశ్న

అభ్యర్థు లిద్దరిలో ఎన్నిక పూర్తిఅయే వరకూ ఎవరికి వారు తమకే ఎక్కువబలం వున్నట్లు భావిస్తుండడం సహజం ఓడిపోయే వరకూ తెలియదు ఒకవిధంగా ఆలోచిస్తే పోటీ జరగనివ్వడమే మంచిదేమో కూడా ఎవరి బలం ఎంత వున్నదీ తేలిపోయి, సందిగ్ధ పరిస్థితి తేలిపోయే వీలుంటుంది గెలిచిన వ్యక్తి పరిపూర్ణమైన ఆత్మవిశ్వాసంతో రాష్ట్ర పరిపాలనా వ్యవహారాలను నిర్వహించే అవకాశం ఏర్పడుతుంది

మొత్తంమీద తాము పోటీనుంచి విరమించేది లేదనీ, నాయకత్వానికి తాను అభ్యర్థిగా నిలుస్తున్నాననీ ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యులకు శ్రీ గోపాలరెడ్డి, అధిష్ఠానవర్గంతో చర్చ ముగించుకొని రాగానే, లిఖితపూర్వకంగా తెలియజేశారు

మొత్తంమీద వీరిద్దరికీ మధ్య జరిగే పోటీ చాలా తీవ్రంగా వుంటేమాట వాస్తవం. తెలంగాణా కాంగ్రెస్ శాసనసభ్యులు 51 మందిలో ఖచ్చితంగా 40 మంది తమనే బలపరచబోతున్నారనే విశ్వాసంతో వున్నారు శ్రీ సంజీవరెడ్డి ఈ ఉభయులలో ఎవరు గెలిచినా శ్రీ బూర్గుల రామకృష్ణరావు గారి వరం ప్రదర్శించే వైఖరిమీదే ఫలితం ఆధారపడివుంటేట్లు కనిపిస్తున్నది తమ అనుచర వర్గానికి యథేచ్ఛగా వోటుచేసే అధికారాన్ని ఇవ్వదలచినట్లు హైదరాబాదు ముఖ్యమంత్రి ప్రకటించారు

జయాపజయాలు శాసనసభ్యుల అధీనాలు ఉభయులలో ఎవరు గెలిచినా కొద్ది తేడాతోనే అయివుంటుంది. ★

కాటూరి, పింగళికవుల సౌందరనందం గాంధీయుగానికి చిహ్నప్రాయమన్నారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు నన్నయాదుల నాటినుండి నిన్న మొన్నటివరకూ, నేటివరకూ మన సంప్రదాయాలను తీక్ష్ణంగా ఆకళించుకొన్న వారిలో వీరగ్రగణ్యులన్నారు

విశ్వనాథవారు 'నిన్నటి' వైపూ, కృష్ణశాస్త్రిగారు 'రేపు' వైపూ ఒక్కరవ్వ మొగ్గితే, ఈ కవిద్వయం ప్రాచీనాధునికాలను సమన్వయించి నవసౌరభాలు వెల్లివిరియజేసినదని పిలకా గణపతిశాస్త్రిగారు అన్నారు మల్లంపల్లి శరభయ్యగారు చక్కని పద్యాలను చదివి సమర్పించారు

సభకు వచ్చిన కవులూ, విద్వాంసులూ పలువురు సన్మానితులను అభివందనలతో పునః సన్మానించి సంతోషం తెలియచేశారు కొందరు అచ్చతెలుగులో ఆనందం వెలిబుచ్చారు కొందరు సంస్కృతంలో సంతోషపడ్డారు మరికొందరు చమత్కారాలతో ఛలోక్తులతో కొత్తపంథాలు అవలంబించారు నార్ల వెంకటేశ్వరరావుగారు, ప్రసంగిస్తూ, కాటూరి వెంకటేశ్వర రావుగారు జంటకవిత్వం విరమించుకుని విడిగా చెప్పడం మంచిదని సూచించారు

## కవిమిత్రుడి కథ

కోలవెన్ను రామకోటేశ్వర రావుగారు తాము "కవిమిత్రు"లని సగర్వంగా చెప్పి సంతోషం వెలిబుచ్చారు కవిత్వం రాకపోయినా, కవిగారితో మైత్రివల్ల తమకీ 'కవిమిత్ర' బిరుదు వచ్చిందన్నారు నవ్వుతూ ఒకసారి, బెంగుళూరులో ఒకసభజరిగింది అక్కడ కాటూరివారికి ఒక చక్కని శాలువ ఇచ్చి సత్కరించారు అది చాలా బాగుందని నేను ఒకటికొనుక్కుని మరీ వేసుకున్నా అయితే నేం ఈయన వెంట ఉండడం చూసి, నేనూ కవినే కాబోలనుకున్నారంతా అనిఅన్నారు రామకోటేశ్వరరావుగారు

ఘనులకు సహజమైన వినమ్రతతో కాటూరి వెంకటేశ్వరరావుగారు తమకు సన్మానం చేసినందుకు సంతోషం వెలిబుచ్చారు

తరవాత ఇలా అన్నారు.

"ఇంతకన్న నే నేం చెప్పగలను? మీరందరు నన్ను పిలిచి కూర్చోపెట్టి "నువ్వుగొప్పవాడివని వరసన మెచ్చుకుంటున్నారు. ఇది వరకు ఎవరికేనా సన్మానం జరిగినప్పుడు చూడ్డానికి కొంత వినోదకరంగా ఉండేది ఇప్పుడు నావరకూ వచ్చింది కాబట్టి నాకు తెలిసింది జవాబేమని చెప్పడం నేను గొప్పవాణ్ణి కానని వాదిస్తే మీరసజ్ఞతను శంకించినవాణ్ణి అవుతాను మరి మీ మాట నిజమే అంటే అది అహంకారం కాస్తా కూస్తా తెగడితే నైనా జవాబు చెప్పవచ్చుగాని, వరసగా పొగిడితే ఏం చెప్పగలరు గుడ్లప్పగించి ఊరుకోవడం తప్ప"

## ఒక ప్రశంసాపత్రం

"కొందరు నేను చాలా మంచివాణ్ణి అన్నారు పెళ్ళికొడుకు ఎవరో మాకు తెలీదు కాని మురుగులు మటుకు మావే అన్నారట వెనకటి కెవరో అలాగ కవిత్వం మాట ఎలా ఉన్న, మంచివాణ్ణి అనిపించుకున్నందుకు సంతోషం సందర్భం వచ్చింది కాబట్టి చెబుతున్నా అసలు జంటకవిత్వం మూలాన్నే నేనసలు కవి నయ్యాను ఇపుడు అది మానెయ్యమంటే, అసలు నన్నింక కవిత్వం చెప్పవద్దనడమే అవుతుంది" అన్నారు వెంకటేశ్వరరావుగారు నవ్వుతూ.

## సంగీత సాహిత్యాలు

వెంకటేశ్వరరావుగారు తమ ప్రసంగంలో, తోటి సన్మానితులు సాంబమూర్తిగారి ప్రతిభను ప్రశంసించారు

అనంతరం ఆపాతమధురం ఆలోచనామృతం అయిన సంగీత సాహిత్యాలలోను, వివిధ కళలలోను తరతమ భేదాలను వివరిస్తూ సూక్ష్మాతిసూక్ష్మమైన ఆకాశంనుండి ఆవిర్భవించే నాదాధారమైన సంగీతమే గుణరూపరహితుడైన సర్వేశ్వరునకు అత్యంత సన్నిహితమన్నారు

సాంబమూర్తిగారు మాట్లాడుతూ, రాజకీయాలు ఎలా ఉన్నా, ఏమి ఏమైనా, త్యాగరాజస్వామిమాత్రం తెలుగు తమిళప్రజలను తెగని బంధంవంటివాడని అన్నారు






"రద్దీ తగ్గిస్తే చాలు; అదే పదివేలు"........జలపథాలు; నదులను కలిపే అద్భుత పథకం........సైన్యంలో చేరదలిచిన వారికి కొత్తరకం పరీక్షలు.

పూర్తిగా మూడవ తరగతి పెట్టెలతో కూడిన ఎయిర్ కండిషన్డ్ రైలును ఈ మధ్య పరీక్షార్థం త్రిప్పుతున్నారు. మూడవ తరగతి ప్రయాణీకులకు క్రొత్తగా ఈ సౌకర్యం కలిగించడం హర్షించదగినదే. కాని ప్లానింగ్‌కు సంబంధించిన ముఖ్యమైన ప్రశ్న ఒకటి ఉదయిస్తున్నది. మూడవ తరగతి ప్రయాణీకునికి కావలసింది రద్దీలేని సుఖప్రయాణమా, ఎయిర్ కండిషన్డ్ పెట్టెలా?

సామాన్య గ్రామీణ ప్రయాణీకునికి కూర్చోడానికి జాగా ఉంటే చాలు, ఎయిర్ కండిషన్ పెట్టెలక్కరలేదు. బోలెడు డబ్బు ఖర్చుచేసి ఎయిర్ కండిషన్డ్ పెట్టెలు నిర్మించడం, పెద్ద పెద్ద రైల్వే స్టేషన్లు కట్టించడం, రైల్వే వేగం ఎక్కువచెయ్యడం మొదలైన చర్యలమూలంగా తనకు అన్నిటి కంటే ముఖ్యమైన స్థలసౌకర్యం అశ్రద్ధచేయబడుతోందని సామాన్య ప్రయాణీకుడు భావిస్తున్నాడు; రైళ్లలో రద్దీతగ్గిస్తే అదే పదివేలని భావిస్తున్నాడు. మొత్తం రైల్వే బడ్జెట్ దృష్ట్యాచూస్తే వీటికయ్యేఖర్చు ఆట్టే లేకపోవచ్చు. కాని కోట్లకొద్దీ ధనం ప్యాసెంజర్ బండ్లను పకేపదే మార్చడానికి ఖర్చు చేయబడుతోంది. మూడవ తరగతి ఎయిర్ కండిషన్డ్ రైళ్ళకు ఖర్చుపెట్టేధనం రద్దీ తగ్గించడానికి కొంతయినా ఉపయోగపడేది.

## నదులను కలిపేస్కీము

ఇది అద్భుతపథకాల యుగంలాగా ఉంది చూడగా చూడగా.

భారతదేశంలోని ప్రధాన నదులన్నిటినీ కలిపే అద్భుతపథకం ఒకటి తయారులో ఉంది.

1874 లో చాతమ్‌స్కూల్ ఆఫ్ మిలిటరీ ఇంజనీరింగ్‌లో జరిగిన సభలో లెఫ్టినెంట్ జనరల్ సర్ ఆర్థర్ కాటన్ నదులను కలిపే స్కీము ఒకదాన్ని ప్రతిపాదించాడు. ఆయన చెప్పినదిది:

"మొదటి జలమార్గం భారతదేశాన్ని చుట్టి వస్తుంది. బొంబాయినుంచిఅహమ్మదాబాదు పోయి, సింధులోయమీదుగా, సర్‌హింద్ కాలువదాటి గంగకాలువ చేరి గంగాలోయ దిగి కలకత్తావెళ్ళి తూర్పు కోస్తావెంబడి కన్యాకుమారీ అగ్రము చేరి, పడమటి కోస్తా వెంట గోవావద్దఉన్న కార్వార్ చేరుతుంది ఈ మొదటిమార్గం. ఈ మార్గం పూర్తిగా

**శ్రీ కృష్ణ**

[ఆంధ్రపత్రిక విలేఖరి]



బొంబాయి గవర్నరు పదవినుంచి తప్పుకుని ఒరిస్సా ముఖ్యమంత్రి పదవిస్వీకరిస్తున్న శ్రీ హరేకృష్ణ మెహతాబ్.

ఉండా అడ్డుపడేది గోవానుండి బొంబాయికి వెళ్లే ధోవఒకటే. రెండవమార్గం: ద్వీపకల్పానికి అడ్డంగా గోదావరి, వర్ధా, తపతీ నదీలోయలను దాటి మొదటి మార్గాన్ని బరోడావద్ద కలుస్తుంది. మూడవది కూడా ద్వీపకల్పానికి అడ్డంగా నెల్లూరువద్ద బయల్దేరి పెన్న, తుంగభద్ర, కలానది కలుపుకుంటూ పడమటి కోస్తాలో కార్వార్ చేరుతుంది. నాలుగవది మద్రాసునుండి కన్నడ దేశానికి అడ్డంగాపడి అమరావతి, పాలఘాట్ నదీలోయలద్వారా పడమటి కోస్తానున్న పోనాని చేరుతుంది.

వర్ధా జలమార్గాన్ని మహానదిలోయతో కలిపి తూర్పు కోస్తానున్న కటక్‌కు చేర్చవచ్చు.

వర్ధాను వైన్‌గంగద్వారా నర్మదానదితో కలపవచ్చు. నర్మదానదిని చంబల్ లోయతో కలిపి అలహాబాదువద్ద గంగాలోయ మార్గంతో కలపవచ్చు.

బ్రహ్మపుత్ర ప్రయాణ సౌకర్యాలకు ఇప్పుడు బాగానే ఉన్నది. అయితే దాన్ని కూడా అభివృద్ధి చేయవచ్చు. బ్రహ్మపుత్ర నుండి 300 లేక 500 మైళ్లు భూమార్గం దాటితే భారతీయ జలమార్గాలన్నిటినీ యాంగ్‌ట్సీ నదితోను, తద్వారా చైనా జలమార్గాలతోనూ కలపవచ్చు. దీనివలన చైనాలోకి దగ్గిరదారి ఏర్పడుతుంది ఇది రాజకీయంగా ప్రాముఖ్యం కలిగినమార్గం. భారత చైనా దేశాల 60 కోట్ల జనాభాను ఏకం చేసినట్లవుతుంది"

82 ఏళ్ళకిందట సర్ ఆర్థర్ కాటన్ పై స్కీము ప్రతిపాదించాడు. అప్పటిపరిస్థితులు వేరు, ఇప్పటి పరిస్థితులు వేరు. ఆ స్కీము ఇప్పటి పరిస్థితులలో గతజలసేతుబంధనం లాంటిది. ఆనాటి భారతదేశం ఇప్పుడు లేదు. దేశ విభజనతో అంతా తారుమారైంది.

అస్సామ్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలకు ఎంతో ముఖ్యమైన నీటిమార్గాలు ఇప్పుడు విచ్ఛిన్నమైపోయాయి. అదీగాక 1874 తరవాత అభివృద్ధి అయిన నీటిపారుదల స్కీముల వల్ల నదీ ప్రయాణాలు అసంభవంగా తయారైనాయి. నా చిన్నతనంలో యమునానదిలో పడవలు ఢిల్లీదాకా వచ్చేవి. అంతకు ముందు కాలంలో కలకత్తానుండి ఢిల్లీకి తన పడవప్రయాణాన్ని మహర్షి దేవేంద్రనాథటాగూరు ఆత్మకథలో వర్ణించారు. ఇప్పటి నీటిపారుదల కాలువలు అటువంటి ప్రయాణాన్ని అసంభవం చేశాయి. కాని ఇది సామాన్యులను మాత్రమే బాధించే ప్రశ్న. కేంద్రజలమార్గాలశాఖ నిపుణులు, విద్యుచ్ఛక్తి కమీషన్ నిపుణులు ఈ సమస్యను సులభంగా పరిష్కరించివేస్తారనుకుంటాను. భారత నదీమార్గాలను తేలిగ్గా కలిపేసే "అద్భుత పథకం" తయారుచేసి పారేస్తారనుకుంటాను. ఈ అద్భుత పథకానికి ఎంత డబ్బు అవుతుందీ, ఎక్కణ్ణించి ఆ డబ్బు తెస్తారు ఇవన్నీ ఆలోచించ మొదలిడితే మనస్సు వ్యాకులమవుతుంది.

రక్షణశాఖ విద్యాలయాల మంత్రి శ్రీ మహావీర్ త్యాగి ఈమధ్య ఒక శిక్షణాలయానికి వెళ్లారు. అక్కడ శిక్షణ పొందుతున్న సైనికులను చూసి ఆయన హడలెత్తిపోయారు. కొందరు అంగుళం దళసరి కళ్లజోళ్లు పెట్టుకునివున్నారు. కొందరు లోతుకుపోయిన బుగ్గలతో కనిపించారు. వీరు త్వరత్వరగా ఆఫీసర్లైపోవాలని పాఠాలు బట్టీ పడుతున్నారు. ఇదంతా చూసి ఆయన, భారతీయ సైన్యాలలో రిక్రూట్ కావడానికి, శరీరశక్తిపరీక్షలో నెగ్గాలనే నిబంధన ఒకటి ఏర్పాటు చేయించారు. ఖడక్‌వాస్లా, డెహ్రాడూన్ శిక్షణాలయాలలో చేరదలచుకునే అభ్యర్థుల శరీరసామర్థ్యాన్ని క్షుణ్ణంగా పరీక్షచేయడం ముఖ్యావసరంగా పరిణమించింది. అందుచేత అభ్యర్థులకు సాధారణ ఆరోగ్యపరీక్ష మాత్రమే గాక, దేహదార్ఢ్య పరీక్షకూడా పెట్టాలని ప్రభుత్వం నిశ్చయించింది. నేషనల్ డిఫెన్స్ ఎకాడమీ గడచిన సంవత్సరాలలో జరిపిన దర్యాప్తు ద్వారా, సాధారణ ఆరోగ్య పరీక్షలో ఉత్తీర్ణులైన అభ్యర్థులు దార్ఢ్యంలోను, ఓరిమిలోను పరీక్షకు నిలవలేకపోయారని తేలింది. ఇప్పుడు ప్రవేశపెట్టిన కొత్త పరీక్షావిధానం ఫలితాలను పరిశీలించే నిమిత్తం రెండేళ్లపాటు అమలులో ఉంటుంది. 1957 జనవరినుంచి ఇది అమలులోకి వస్తుంది.

ఈ విధానం ప్రకారం అభ్యర్థి ఊపిరితిత్తులశక్తిని స్పైరోమీటర్‌తో కొలుస్తారు. స్పైరో మీటర్ తాలూకు గొట్టం నోట్లో పెట్టుకుని నుంచుంటాడు అభ్యర్థి. ముక్కుకి క్లిప్పు ఒకటి పెట్టి గాలి పీల్చడంగాని వదలడంగాని జరుగుతోందేమో కనిపెడతారు. ఆ తరవాత అతన్ని చేతనైనంత ఎక్కువగా గాలిపీల్చి తరవాత గొట్టం ద్వారా స్పైరోమీటర్‌లోకి వదిలిపెట్టమంటారు. మూడుసార్లు ఇలా పరీక్షిస్తారు. ఏ రీడింగ్ ఎక్కువగా ఉంటే ఆ రీడింగ్‌ను తీసుకుని దాన్ని బట్టి అతని ఊపిరితిత్తుల శక్తిని క్యూబిక్ సెంటిమీటర్లలో నిర్ణయిస్తారు.



భారతదేశంలో సతీసమేతంగా పర్యటిస్తున్న బ్రిటిష్ మాజీ ప్రధాని, కార్మికపక్ష నాయకుడు అట్లీ

మరొకరకం పరీక్షలో అభ్యర్థిని రెండు నిమిషాల సేపు బస్కీలు తీయమంటారు. 30 సెకండ్లసేపు విశ్రాంతి ఇస్తారు. అతని నాడి యథాస్థితికి ఎంతవేగంగా వస్తుందో ఒకనిమిషంసేపు పరిశీలిస్తారు. ఈవిధంగా నాడి యథాస్థితికి రాగలవేగాన్ని బట్టి అభ్యర్థులను తరగతులవారీగా విభజిస్తారు. అభ్యర్థి రెండునిమిషాలసేపూ పూర్తిగా బస్కీలు తీయలేకపోతే, ఎంతసేపుతీశాడో లెక్కచూసి దాన్నిబట్టి ఎంతసేపు తీయగలడో లెక్కకట్టి అతని శక్తి నిర్ణయిస్తారు.

ఈ పరీక్షలన్నీ కొత్తగా ఉండడంచేత, సాధారణంగా అభ్యర్థులకు ఏమవుతుందోనన్న ఆదుర్దా ఉంటుంది గనక ఒక్కొక్కసారి తప్పుఫలితాలు రావచ్చు. బస్కీలు అలవాటులేని అభ్యర్థులు పరీక్షకు హాజరై నెగలేకపోవచ్చు. గుండె ఊపిరితిత్తులు, నరాలు, కండరాలశక్తిని అంచనా వేయడానికి ఈపద్ధతులనే అన్నిచోట్లా అనుసరిస్తారు. కాని అన్నివిధాలా ఆరోగ్యవంతులని నిర్ణయింపబడిన అభ్యర్థులు కూడా ఈమాదిరి పరీక్షలలో నెగ్గలేకపోవడం సంభవం. అందుచేత ఈ పరీక్షలను కొందరికి వర్తింపజేయరాదని కూడా నిశ్చయించారు. అన్ని విధాలా అర్హులని నిర్ణయింపబడి, మెడికల్ బోర్డుచేత ఆమోదింపబడిన అభ్యర్థులు ఈ పరీక్షలలో నెగ్గకపోయినా వారిని సైన్యంలో చేర్చుకోడానికి అభ్యంతరం ఉండదు. అంతేగాక మొదటిసారి నెగ్గలేని అభ్యర్థులకు 48 గంటల తర్వాత మరో ఛాన్సు ఇస్తారు. ఏ ఫలితాలు బాగా ఉంటే వాటినే పరిగణిస్తారు. ఈపరీక్షల మూలంగా ఖడక్‌వాస్లాలోని నేషనల్ డిఫెన్సు ఎకాడమీలోకి, డెహ్రాడూన్ మిలిటరీ కాలేజీలోకి చేర్చుకోబడే అభ్యర్థుల దేహదార్ఢ్యంలో అభివృద్ధిని కనబరచవచ్చునని ప్రభుత్వం ఆశిస్తున్నది. ★

## వెనక తార: కనకతార

యాభై, అరవై సినిమాల్లో నటించి ఇప్పుడు కొంచెం వెనకబడిన ఒక ప్రౌఢతారతో ఎవరో చెప్పారు, ఫలానా వర్తమాన తార ఏ చిత్రంలో నటిస్తే ఆ చిత్రానికి కనకవర్షం కురుస్తోందని. ప్రౌఢతార ఉక్రోషం పట్టలేక "ఈ జనానికి గ్లామర్ ఉంటే చాలు, ఎగబడతారు. నటన ఏకోశానా రాకపోయినా, మొహం కొయ్యముక్కలా పెట్టి నిలబడ్డా పరవాలేదు," అన్నది.

ప్రౌఢతార ఇలా అన్నదని వర్తమాన తారకి ఎవరో చేరవేశారు. ఆమె కులాసాగా నవ్వి "నాకు ఆవిడగూర్చి బాగా తెలియదుగాని మా అమ్మకి చిన్నప్పటినుంచీ ఆవిడ సినిమాలంటే చాలా ఇష్టం" అన్నది.

# హతోస్మి

"ఉన్నట్టుండి ఒకసారి ఆకస్మికంగా అవధాని తనతో యింత విచిత్రంగా ప్రవర్తిస్తున్నాడేమిటి?" అని నిజంగా ఆశ్చర్యపోయాడు రాఘవయ్య

రాఘవయ్య ఆశ్చర్యపోవడంలో ఆశ్చర్యం లేదు!

అవధానికి రాఘవయ్యంటే ప్రాణం రాఘవయ్యకూ అవధాని విషయంలో అంతే వేళ్లు తన్ని వూడలు దిగిన స్నేహం వాళ్ళది

బాల్యం నించీ చెట్టాపట్టేలు వేసుకుని తిరుగుతూ ఒక్క వూళ్లో వుండి ఒక్క స్కూల్లో చదువుకున్నారు మధ్యలో నాలుగేళ్లు ఎడబాటొచ్చినా కడకు అదృష్టవశాత్తూ ఒకే ఆఫీసులో యిద్దరూ ప్రభుత్వ కర్మకాండ జరపడానికి కుదురుకున్నారు పోతే అతను ఓ గదిలో పనిచేస్తే యితను మరో గదిలో పనిచేస్తాడు. ఇద్దరికీ జీతభత్యాల్లో కూడా పెద్ద తేడా ఏమీ లేదు రాఘవయ్యకు నాలుగు, రూకలు కావాలనుకుంటే అవధాని, అవధానికి, ఐదు కావాలనుకుంటే అవసరమయితే రాఘవయ్య, చెయ్యి మార్పులు మామూలు కూడా వుంది వాళ్ళ స్నేహాన్ని చూసి ఆఫీసులోనూ బయటా చెప్పుకుని అభినందించని వాళ్ళు లేరంటే అతిశయోక్తి కాదు అలాంటిది రాఘవయ్యతో యింత కలిసిమెలిసి తిరిగే అవధాని అకస్మాత్తుగా వారం రోజుల్లో పూర్తిగా మారిపోయాడు

వీలైనంత వరకూ రాఘవయ్యని తప్పించుకుని తిరగడం మొదలుపెట్టాడు ఆఫీసుకు వొచ్చినప్పుడూ వెళ్ళేప్పుడూ రాఘవయ్యకన్నా ముందుగానో వెనకగానో జారుకుంటున్నాడు ఆఫీసులో సరే సరి సీటు మార్పించుకుని ఆఫీసరు గదిలోనే ఆరు గంటలూ గడిపేస్తున్నాడు మూడు రోజుల వరకూ "ఏం పనో? ఏమో?" అనుకుని సమాధానపడ్డాడు రాఘవయ్య కాని క్రమక్రమంగా అవధాని తమ స్నేహాన్ని దూరం చేస్తున్నట్టు కొన్ని సంఘటనలవలన అర్థం చేసుకున్నాడు మనసు విలవిలా తన్నుకుంది గుండె పొంగి పొరలొచ్చింది

అవధానికి తనేం అపకారం చేశాడని? ఏం అన్యాయం చేశాడని; తనంటే అంత అయిష్టంగా వుంటున్నాడు?... ఎంత ఆలోచించినా తన విషయంలో మాత్రం ఏమీ దోషం లేదనిపించింది రాఘవయ్యకు

వారం రోజులు గడిచినా కూడా పరిస్థితి ఏమీ మారలేదు పోనీ తనే కలగజేసుకుని అడిగితే ఏం అనిపించింది ఏదో సందర్భం చూసి - 'మీ యింటికి రావాలనుకుంటున్నాన్రా అవధానీ' అన్నాడు

'ఎందుకూ? వీలు చూసుకుని నేనే మీ యింటికొస్తాను' అంటూ తప్పించుకుపోయాడు అవధాని

రాఘవయ్య యీ మాట విని నిశ్చేష్టుడైపోయాడు అవధాని నోటంట యిటువంటి

## నిష్ఫల బ్రహ్మాజీ

మాట అనగా తనెప్పుడూ వినలేదు ఇప్పుడు మాత్రం ఎందుకనాలి అని అనేక విధాల వాపోయాడు ఇలాంటి వెన్నో జరిగిన మీదట మనసులో దాచుకుని భరించలేక యింకో మిత్రశ్రీ సుబ్బారావు సముఖంలో వెళ్ళబోసుకున్నాడు తమ స్నేహం ఎలాంటిదో వర్ణించి చెప్ప దానికి యిలాంటి విఘాతాలు ఏర్పడానికి గల కారణం తెలియలేదని ఏడ్చాడు.

'జ్యోత్స్నా బాబూ! అర్ధాంగ లక్ష్మి అడుగు పెడితే అంతా అలానే మారిపోతారు' అన్నాడు మిత్ర శ్రీ సుబ్బారావు

రాఘవయ్య కుర్చీలో లోతుగా కూరుకుపోయాడు

'ఏమిటీ? అవధానికి పెళ్ళయిందా? ఎప్పుడూ?' అన్నాడు ఆశ్చర్యంగా

'నీ మొహం తాగొచ్చావా యేం? అంజనేయుడికి తోకలా అహర్నిశలూ అంటిపెట్టుకు తిరుగుతావ్! అవధానికి పెళ్ళయితే నీకు తెలీదూ?' అన్నాడు సుబ్బారావు మామూలు ధోరణిలోనే

రాఘవయ్యకు నెత్తిమీద సుత్తి పెట్టి కొట్టినట్టయింది కళ్లు గిర్రన తిరిగిపోయాయి వంటి మీద స్పృహ తప్పిపోతూన్నట్టనిపించింది

నిజంగా అవధాని యింత పని చేశాడా? అవధాని పెళ్లి తనకు తెలియకుండానే జరిగిందా? జరుగుతుందా? అప్రస్తావనే తనకు తెలీదే? అవధాని ముందుగా తనకు ఆహ్వానం పంపించక పోతే పోయె కనీసం పెళ్ళయినా కయినా అయినట్టు చెబితే తను సంతోషించడూ! తను సంతోషించడన్న అపనమ్మకం అతనికెందుకు కలిగింది సంతోషించక దుఃఖించడానికేముందింగనీ కాని అవధాని ఎంత ద్రోహం చేశాడు అని రాఘవయ్య కళ్లు కుతకుతా వుడికిపోయింది

'అయితే నిజమేనంటావ్?' అంటూ సాలోచనగా సుబ్బారావు వైపు చూశాడు

సుబ్బారావు విరగబడి నవ్వేడు-

'నా కాశ్చర్యంగా వుందబ్బాయ్! అవధాని పెళ్ళి సంగతి నిజంగా నీకు తెలీనే తెలీదన్న మాట! నేన్నమ్మలేను ఆఫీసుపని అధికమై నీకు మతిచలిస్తోంది వాడు చెప్పే వుంటాడు . కాస్త తెలివి తెచ్చుకో' అంటూ మళ్ళీ నవ్వాడు సుబ్బారావు

'లేదు' మెల్లగా మూల్గాడు రాఘవయ్య-'అవధాని నిజంగా నాకేం చెప్పలేదు నీతోడు'

సుబ్బారావు మొహం దీంతో సీరియస్ గా మారిపోయింది

---

**జబ్బులు, మందులు**

సినిమా స్క్రిప్టు రచయితగా చరచరా పైకి రాదలుచుకున్న ఒక యువరచయిత ఇలా బోర్డు కట్టాడు:

"అన్ని రకముల సినాప్సిస్ లకు, సినేరియోలకు ఇక్కడ చక్కని ట్రీట్ మెంటు చేయబడును"

## ★ హాతోస్మి ★

'ఔరా కాలమహిమ' అన్నాడు అయితే అవధాని నీకెందుకు చెప్పలేదూ?'

'అదే నాకూ బోధ పడలేదు' అంటూ రాఘవయ్య లోలోన కుమిలి పోయాడు.

సుబ్బారావు ఓదారుస్తూ అన్నాడు-

'అసలు ముందుగా ఎవ్వరికీ తెలియదనుకో అంతా అనుకోకుండా జరిగిందట అది సరే పోనీ నన్నూ వెంకట్రావునీ కాఫీకి రమ్మని నిన్న పిల్చాడే! నిన్నుకూడా పిలిస్తే ఏం? వెధవ దుర్బుద్ధి' అంటూ నిజంగా రాఘవయ్య పట్ల యిది ఘోర అన్యాయం అని చాటుతూన్నట్టు మొహం పెట్టాడు

రాఘవయ్యకు మరీ కడుపులో దేవుతూన్నట్టనిపించింది అయితే అవధాని ప్రవర్తనలో మార్పుకి కారణం యిదే నన్నమాట అనుకున్నాడు.

'పోనీ లెస్తూ వాడికేదో పోయికాలం పుట్టింది, కానీ,' అన్నాడు చివరికి ఏడుపు మొహం పెటి

కానీ సుబ్బారావు వ్యవహారాన్ని అంతటితో చావనీయలేదు

'మాడు రాఘవయ్యా! అమ్మాయి ఎర్రగా చక్కగా గులాబీపువ్వులాగా వుంటుంది అందుకని వాడికేమైనా భయమేమో! అన్నాడు

'ఎందుకూ!' అన్నాడు రాఘవయ్య అమాయకంగా

'ఎందుకేమిట్రా వెర్రిగుట్టా! ఆమె అసలే అందాల గులాబీ అందానికి యింగుడైనా జితేంద్రియుడైనా లొంగక తప్పదు చూసి చూసి ఆ గులాబీని తెంపుకు పోతే!' నవ్వుతూ రాఘవయ్య ముఖంలోకి చూశాడు సుబ్బారావు

'నోర్ముయ్' అన్నాడు రాఘవయ్య-' ఎవరన్నా వింటే ఏంమాట'

'ఇదే నీతో వొచ్చిన చిక్కు' కాట్లకుక్కలా కలియబడక సొంతం వివరాబుద్ధాక తారం! వాడికటువంటి అనుమానం వుందేమో? అంటా' అన్నాడు సుబ్బారావు.

'నాపూహా కంతే తోచింది మరి'-

'పోనే నీ దచ్చు మెదడు అంతకన్నా ఎక్కువేం ఆలోచిస్తుంది అసలు సంగతిది కాదు' అంటూ రాఘవయ్య ఆలోచించసాగేడు

'కాకపోతే నీకర్మ ... పగలకొట్టుకో, చెపోతా' అంటూ సుబ్బారావు నిష్క్రమించాడు

రాఘవయ్య యింకా లోతుకు ఆలోచించాడు. కాని ఎంత ఆలోచించినా సుబ్బారావు ఆలోచించిన దానికన్నా

ఎక్కువ ఆలోచించలేక పోయాడు కడకు సుబ్బారావు చెప్పిందే నిజమేమో అని కూడా అనిపించింది కాని పూర్తినమ్మకం కుదరలేదు

'అవధాని భార్య అంత అందమైనదా? అయితే ఒకసారి చూసివస్తేనే అని మాత్రం అనిపించింది కాని మనసు తేలిక పడలేదు ఆ రాత్రి మినర్వాలో 'అనార్కలీ' అవుతోందంటే మనశ్శాంతికోసం ఆఫీసు నించి సరాసరి అక్కడికే వెళ్ళాడు

కాని అప్పటికే చాలా ఆలస్యమయింది. జనం తోపులాట జాస్తిగావుంది రూపాయి పావలా టిక్కెట్లయిచ్చే కౌంటరుదగ్గిర తప్ప తతిమ్మా కిటికీలదగ్గిర ఘోరాతిఘోరంగా పోరు సాగుతోంది కొందరు అతిరథులు, మహారథులు క్యూలో నించున్న మనుష్యుల తలకాయలమీంచి నడిచి పోతున్నారు రాఘవయ్యకు విముఖత కలిగింది

'పోవడం పోవడం రూపాయి పావలా యిచ్చి యివాళే చూడాలన్న మాటేమిటి?' అనుకుని గిరుక్కున వెనుదిరిగి పోయాడు

పోతూ పోతూండగా అతనికో చక్కని ఆలోచన మెరుపులా మెరిసింది! ఈపట్టున అవధానియింటికిపోతే? సుబ్బారావు చెప్పిందాంట్లో నిజానిజాలు తెలుసుకోవచ్చు అనుకోవడమేమిటి రూటుమార్చాడు రాఘవయ్య అవధాని యిలు దాటుతూ లోనికి తొంగి చూశాడు

తలుపు గొళ్ళెం పెట్టవుంది దానికున్న పెద్దతాళం కప్ప చూడగానే ప్రాణం వుసూరుమంది కాళ్ళీడ్చుకుంటూ, సుబ్బారావుని తిట్టుకుంటూ యిల్లు చేరుకున్నాడు

* * *

రాఘవయ్య ఎంత మర్చిపోదామనుకున్నా సుబ్బారావు మాత్రం మానిన గాయాన్ని మళ్ళీ రేపుతూనే వున్నాడు

'అయితే యింతకూ ఏమిటాలోచించావు రాఘవయ్యా?' అంటూ మర్నాడు ఉదయం కాఫీక్లబ్బుదగ్గిర మళ్ళీ యిదే ప్రస్తావన తెచ్చాడు

రాఘవయ్య యింతవరకూ ఏ ఆలోచనా చెయ్యకపోయినా ఆ క్షణంలో సుబ్బారావు అన్న మాటమీద టపీమని ఆలోచించి చెప్పేశాడు—

'ఆలోచించానోయ్ వాడికల్లా బుద్ధి చెప్పడానికి తగిన అవకాశం నాకూ వుంది నాలుగేళ్ళయి నేనూ ఒకమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను మా వూరికే ఆ అమ్మాయి పైగా యిద్దరం ప్రేమించుకున్నాం కూడాను ఓ నాల్గురోజులు సెలవు పెట్టవెళ్ళి రైట్ చేసుకొచ్చేస్తాను వాడికి చెప్పకుండా నేనూ యీ పనిచేస్తే చెప్పు దెబ్బ కొట్టినట్టుంటుంది ఏమంటావ్,' అన్నాడు

సుబ్బారావు మందహాసం వెలిగించాడు

'శుభస్య శీఘ్రం' అన్నాడు.

రాఘవయ్య దర్పంగా నవ్వాడు

సుబ్బారావు శ్వాస ఎగపీల్చాడు

'అన్నట్టు చెప్పడం మరిచాను అవధాని కొత్తకాపురం ముచ్చటలన్నీ తీర్చేసుకుంటున్నాడు సుమా!' అన్నాడు

రాఘవయ్య ఆశ్చర్యార్థకంగా మొహం పెట్టాడు

'ఏం లేదులే రాత్రి మొదటాట అనార్కలీ సినిమాకి సతీసమేతంగా విచ్చేశాడు' అన్నాడు సుబ్బారావు

రాఘవయ్య మరింత ఆశ్చర్యపోయాడు

'ఇంకా చూశావుకాదు వాడిముచ్చట వన్‌ఫోర్ క్లాసులో పక్కపక్క కుర్చీల్లో కూర్చున్నారు వాళ్ళ నవ్వులూ, వాళ్ళ హాస్యాలూ - ఏం చెప్పమంటావ్! నేనూ వూసుపోక వెళ్ళాను ఖర్మవశాత్తూ ఆ వెనక రోలో పడ్డాను' అంటూ నవ్వాడు సుబ్బారావు

రాఘవయ్య మొహం వెలవెలా పోయింది సినిమాదాకా వెళ్ళి తిరుగుముఖం పట్టినందుకు తన్నుతానే తెగతిట్టుకున్నాడు

'నేనొట్టి వెధవనోయ్' అన్నాడు సుబ్బారావుతో

సుబ్బారావు గతుక్కుమన్నాడు

'ఏం?' అన్నాడు

'సినిమాదాకా వొచ్చి తిరిగొచ్చేశాను' అతి కష్టంమీద అన్నాడు రాఘవయ్య

సుబ్బారావు చాలా విచారించాడు—

'నీదొట్టి దుష్ట జాతకం వోయ్ కాకపోతే ఏంటిది! కలిసొచ్చిన అవకాశం తగలెట్టుకున్నావ్ అయినా యిప్పుడేడ్చి ఏం లాభంలే' అన్నాడు

## పొగరెట్లు

ఒకాయన -"మా అబ్బాయి కెంత పొగరెక్కిందో చూశారా? ఈ మధ్య సిగరెట్లు తెగ పీల్చేస్తున్నాడు"

రెండో ఆయన:—"నయం కాదూ? మా అబ్బాయిని సిగరెట్లే పీల్చేస్తున్నాయి"

* * *

## అమెరికార్లు

ఒకడు —"అమెరికాలో అందరూ కార్లమీదే తిరుగుతారట, తెలుసా?"

మరొకడు:—"అవునవును కార్లన్నీ అమెరికనుల మీదే తిరుగుతాయట కూడాను"

* * *

నిర్వచనం జూరీలు—వాది ప్రతివాదులలో ఎవరి వకీలు గొప్పవాడు అన్నవిషయాన్ని తేల్చేవారు

# ★ హాత్తోస్మి ★

రాఘవయ్య యింకేం మాట్లాడలేక పోయాడు లోపల్లోపలే దుఃఖాన్ని అణుచుకున్నాడు.

"పోనీలే యిప్పుడు మించిపోయిందేమీ లేదులే" అని సమాధానపడ్డాడు, ఆ తరవాత వారం రోజుల సెలవుకు అర్జీపడేసి నిష్పూచీగా రోజులు దొర్లించ సాగేడు

ఇంకోరోజు మధ్యాహ్నం రాఘవయ్య మాంచి పనిలోవుండగా సుబ్బారావు హుషారుగా దిగబడ్డాడు ఒక తాజా వార్తతో

"ఇది నీకు తెలుసా అవధాని బళ్ళారి ట్రాన్స్ఫర్‌కోసం ప్రయత్నించాడుట నూటికి నూరుపాళ్ళూ సక్సెస్ అయిందిట! తపోమూపో కాయితం చేతికొస్తుందనుకుంటున్నారు" అన్నాడు

రాఘవయ్య చేస్తూన్నపని అట్టేపెట్టి - "ఎందుకోసం?" అన్నాడు

"ఏమోమరి అంతా అనుకుంటున్నారివాళ! అన్నాడు సుబ్బారావు

"ఈవూర్నించి చేతప్పించుకోవాలని చూస్తున్నాడన్నమాట అవధాని" అన్నాడు రాఘవయ్య

"అలాగే తోస్తోందిమరి కానీ చూద్దాం" అంటూ సుబ్బారావు తన సీటుకు వెళ్ళిపోయాడు

రాఘవయ్యకు మాత్రం ఆరోజు పనిమీద బుద్ధిపోలేదు అవధాని వెళ్ళిపోతాడంటే అతని కెందుకోదిగులు పట్టుకుంది "అయ్యో అవధాని యింతలా యెందుకు మారిపోయాడు?" అని ఎంతగానో విచారించాడు పోనీ యింతగా మారిపోయాక ఎదురుగా వుండి ఏడ్పించేకన్నా దూరంగా పోవడమే మంచిదేమో అనికూడా అనిపించింది. కాని తనైనా మళ్ళీ అవధానిని యీ విషయమై అడగలేడు సుబ్బారావు చెప్పింది అక్షరాలా జరిగిపోయింది అవధానికి ట్రాన్స్ఫర్ ఆర్డర్లు రావటం అతన్ని రిలీవ్ చెయ్యడంకూడా జరిగాయి ఇప్పుడైనా అవధాని ఒక్కమాట చెప్పిపోతాడేమో అని ఆశించాడు రాఘవయ్య

ఔను చెప్పక పోడానికి వాళ్ళిద్దరికీ ఏం వైరముందని?

కాని అవధాని అందరితోపాటు "బైబై" చెప్పాడే కాని ప్రత్యేకించి రాఘవయ్యతో ఒక్కమాట కూడా చెప్పలేదు రాఘవయ్య ఎలాంటి బాధపడుతున్నాడో కూడా గురించలేదు రాఘవయ్య ఆరోజు సాయంత్రం రోజూకన్నా వేగంగా పని ముగించుకుని యింటికి పోబోతూన్న సమయంలో సుబ్బారావు వెంకట్రావుతో సహా ఎదురొచ్చేడు

"ఏమోయ్! అవధాని దంపతుల్ని చూస్తావేంటి? వెంకట్రావుకి ఫోటోయిచ్చి వెళ్ళాడుట అవధాని" అన్నాడు సుబ్బారావు నవ్వుతో

రాఘవయ్యకు మనసులో చూడాలన్న కుతూహలం లేకపోయినా మర్యాదా గాదని అందిపుచ్చుకున్నాడు సావధానంగా చూశాడు

చూసీ చూడ్డంతోనే మొహం వివర్ణమయింది వొళ్ళు జలదరించింది 'ఘోరం, దారుణం, అమానుషం! ఇంకా ఏవేవో అంటూ పక్కనున్న కుర్చీలోకి కూలిపోయాడు

చుట్టుపక్కల నలుగురూ చేరి రాఘవయ్యని ఆశ్చర్యంగా చూసేసాగేరు వెంకట్రావు కాఫీకోసం మనిషిని పంపించాడు

'ఏమిటోయ్, యీ హంగామా! అన్నాడు సుబ్బారావు రాఘవయ్య భుజం తడుతూ

రాఘవయ్య భోరుమన్నాడు

'అవధాని మారిపోడానికి కారణం యిదే సుబ్బారావ్ పారిపోడానికి కారణం యిదే. గ్రహించలేకపోయాను దారుణం! దానవుడు! నాజీవనసర్వస్వం-నా ప్రాణం, నా ప్రేయసి, నా ప్రియురాలు, నా హృదయసీమలోని అందాల గులాబీని అవధాని పుటుక్కున తెంపుకు పోయాడు. నాశశిరేఖని - నా మానస సరోవరంలోని హంసను వురులుపన్ని కొని పోయాడు అవధాని దుర్మార్గుడు దుష్టుడు!!' అంటూ బావురుమన్నాడు.

సుబ్బారావుకి అంతా అర్థమయింది

"హాతోస్మి! హాతోస్మి! రాఘవయ్యా నీరోజులు బాగులేవు!" అంటూ కాఫీ కప్పు అందించాడు.

అందరూ "హాతోస్మి! హాతోస్మి!" అన్నారు.



## చేతినిండా పనే

ఇద్దరు ఫిలిం రచయితలు కలుసుకున్నారు.

"ఏం బ్రదర్ చాలా బిజీగా ఉన్నట్టున్నావ్?"

"నీకు తెలీందేముంది?... ఒకరోజున ఒక కంపెనీవాళ్ళు ఓపాట రాయమంటే, ఒకపూట పూర్తిగా ఆపనిమీద 'బిజీ' గా ఉంటాను. తరవాత ఇరవై తొమ్మిదిన్నరరోజులూ రావలసిన డబ్బు రాబట్టుకోడంలో చాలా బిజీగా వుంటాను"

# బద్ధకం

బద్ధకం, అతిబద్ధకం, మహాబద్ధకం! ప్రతి బుద్ధిమంతుడిలోనూ ఈ లక్షణం కొద్దో, గొప్పో తప్పకుండా కనిపిస్తుంటుంది పూర్వ కాలంలో సేనాధిపతులను అతిరథులు, మహారథులు అనే బిరుదులతో పిలిచినట్టే, ఈ నాటి నవనాగరికులలో కొందరిని 'అతి బద్ధక' 'మహాబద్ధక' అనే బిరుదాంకితులను చేసినా చేయవచ్చు ఏ అవతరణ మహోత్సవంతోనో జతపరిచి, ఈ బిరుదుల బహూకరణ మహోత్సవాన్ని కూడా జరుపుకోవచ్చు

"రేపటివరకూ వాయిదా వేయడానికి వీలున్న ఏ పనినీ ఈ రోజే చేసి వేయకు సుమా" అన్నది పత్రికా రచయితల విషయంలో చెప్పుకునే పరమ పవిత్రమైన 'నీతి సూత్రం' అంగుచేత బద్ధకస్తులకు బిరుదులు ప్రసాదించడమే జరిగితే, వాటిలో చాలా వాటిని 'పత్రికాకులం' వారే కొట్టి వేసే ప్రమాదదం లేకపోలేదు

బద్ధకానికి పర్యాయపదం సోమరితనం అలా అని బద్ధకస్తులందరినీ సోమరిపోతుల కింద జమకట్టడానికి వీల్లేదు బద్ధకస్తుడు ఒక పనిని ఇవ్వాళ గాకపోయినా, రేపో మాపో చేస్తాడనే నమ్మకం ఉంటుంది, అతిసుకుమారుడైన సోమరి ఆపని అసలు చేస్తాడో చేయడో కూడా చెప్పలేము

వెనుకటికి ఒక 'సుకుమారుణ్ణి' ఒక ప్రత్యేక సంచికకు వ్యాసం వ్రాసి ఇవ్వమని సంపాదకుడు కోరితే, సంచిక వెలువడే ఆఖరురోజు వరకూ అదుగో ఇస్తా, ఇదుగో ఇస్తానని కాలక్షేపం చేశాడట భరోసా మీద పేజీలు తెరుచుకు కూచుకున్న సంపాదక మహాశయుడికి వాటిని నింపవలసి వచ్చేసరికి తల్లప్రాణం తోకకు వచ్చిందట! ఇలావుంటుంది బద్ధకమంటే

బద్ధకస్తులను గురించీ, బద్ధకాన్ని గురించీ మనవారు అనేక చిత్రమైనకథలు చెప్పుకుంటుంటారు

ఒక సంపన్న గృహస్తుఇంట్లో పంచభక్ష్య పరమాన్నాలు భోంచేసి భుక్తాయాసపడుతున్న గురువు తన శిష్యుడితో, "శిష్యా నా పాదరక్షలు ఎక్కడున్నవో చూడు," అంటే, "నీకంటే తక్కువ తిన్నదెవరు గురూ—భుక్తాయాసంతో నీ పాదరక్షలు కనుపించడం లేదు," అన్నాడట ఆ శిష్యుడు.

ఒకవూరు ధగద్ధగాయమానంగా తగులబడి పోతున్నదట ఒక పెద్ద అగ్నికణం వచ్చి ఆవూరిచివర వున్న సత్రంమీదపడి, అదికూడా ఒక వైపునుంచి భస్మమై పోవడం మొదలుపెట్టిందట సత్రంలో చేరిన పరివ్రాజకబృందం అమిత ఖంగారుతో ఎవరి మూటాముల్లె వారు సర్దుకొని బయటపడ్డారట కాని, ఒక పరివ్రాజక శిఖామణి మాత్రం అగ్నిశిఖలను అలాగే చూస్తూ ఎంతసేపటికీ వున్నచోటునుంచి కదలనేలేదట "కొంప అంటుకుందిరా బాబు! బయటపడు," అని వాళ్లునెత్తిన నోరుపెట్టుకుని గగ్గోలుచేస్తే, అతడు "ఇంకా మంటలు నావరకూ రాలేదు, వస్తే చూద్దాంలే" అని ధీమాగా చెప్పాడట

ఇది ఒక అతిబద్ధకుడి గాథ అయితే, 'మహాబద్ధకుడి' గాథ మరొకటి కూడా మనవాళ్లు చెప్పుకుంటారు

ఒకప్పుడు ఒక రాజు తన రాజ్యంలో ఎవడు మహా బద్ధకస్తుడైతే వాడికి గొప్ప బహుమానం ఇచ్చి సత్కరిస్తానని ప్రకటించాడట ఇంకేముంది, ఎక్కడెక్కడి వాళ్ళూ ఆ సత్కారం అందుకోడానికి నేను బద్ధకస్తుడినంటే నేను బద్ధకస్తుడినని ఆస్థానానికి తయారైనారట తనరాజ్యంలో అంతమంది బద్ధకస్తులున్నందుకు రాజుకి ఆశ్చర్యం, విచారం వేశాయట తండోపతండాలుగా వచ్చిన ఆ మహాజనంలో ఎవరు వాస్తవమైన బద్ధకస్తుడో, ఎవరు కాదో కనిపెట్టడం ఎలా? రాజుకు ఆ సమస్య పెద్దచిరాకు కలిగించిందట చివరకు ఒక ఉపాయం తోచి, "మీలో ఎవరు బద్ధకస్తులో చప్పున చెయ్యెత్తండి" అన్నాడట అమిత ఉత్సాహంతో అందరూ గబగబా చేతులెత్తారట తమది రెట్టింపు బద్ధకమన్నట్టుగా కొందరు రెండు చేతులూ ఎత్తారట! ఒకే ఒక వ్యక్తిమాత్రం అసలు చెయ్యే ఎత్తకుండా అలాగే కూర్చొని పోవడం చూసి, రాజు "ఏం నాయనా చెయ్యెత్తలేదేం?" అని ప్రశ్నించాడట

"చెయ్యెత్తే ఓపికే వుంటే ఇంకేం దేమిటి మహాప్రభూ" అని బహు నింపాదిగా జవాబు చెప్పాడట! అంతటితో రాజుకు సమస్య తీరిపోయి, అతగాడే నిజమైన బద్ధకస్తుడని నిర్ణయించి, బహుమానం ఇచ్చిపంపాడట

ఆ రాజు ఏ బహుమానం ఇచ్చాడో తెలియదుగాని మాంఛెస్టర్ నగరంలో జరిగిన ఇదేలాంటి విచిత్రమైన సంఘటనలో బహు సందర్భోచితమైన బహుమానం ఇచ్చినట్లు ఈ మధ్య వార్తలువచ్చాయి

ఫర్నిచర్ తయారుచేసే సంస్థ ఒకటి ఆ నగరంలో బద్ధకస్తుల పోటీ ఒకదాన్ని నిర్వహించింది వార్తాపత్రికలలో ప్రకటన చూసి, పనీపాటా లేకుండా తిని కూర్చునే రకం అతికాయులు, మహాకాయులు దాదాపు వందమంది ఆ పోటీలో పాల్గొనడానికి దరఖాస్తులు పంపుకున్నారు కొంతమంది స్థూలకాయులైన స్త్రీల దరఖాస్తులు కూడా వచ్చాయి తమ బద్ధకాన్ని ప్రదర్శించే ధోరణిలో కొంతమంది గడ్డాలు, మీసాలు పెంచుకొని, మరి కొంతమంది రాత్రి నిద్రపోయే ముందు వేసుకున్న పైజామాలు మొదలైనవి దుస్తులైనా మార్చుకుండానే, 'బెడ్ రూం స్లిప్పర్ల'తోనే పోటీకి వేంచేశారు

దరఖాస్తు పంపిన బుద్ధిమంతులలో ఒకడు "అయ్యా మీరు పోటీ జరుపుతున్న చోటుకు వచ్చే ఓపిక నాకెక్కడుంది? నాబదులు నా స్లిప్పర్ల జత పంపుతున్నాను, చిత్తగించండి," అని వ్రాసి వాటిని పోస్టులో పంపించాడు "శేష్ బద్ధకస్తుడంటే ఇతడినే చెప్పుకోవాలి," అని పోటీ నిర్వాహకులు వాలీసులు అమర్చిన బహు ఒక్కటి పడక కుర్చీని అతగాడికి బహుమానంగా పంపించారు

రాజుగారి ఎదుట చెయ్యెత్తే ఓపికలేని మనవాడు "అతి బద్ధక" అయితే, కాల్లు అడుగులు వేసే ఓపికలేని ఆ మాంఛెస్టర్ బుద్ధిమంతుడు "మహా బద్ధక" బిరుదుకు అర్హుడు కాడూ! ★

## ఉన్నమాట

ఒక సినిమాహాలు మేనేజరుకి ఒకరోజున, ఆట అయిపోయాక, హాలులో వంద రూపాయల నోటు దొరికింది

మనుషుల మీద మంచి గుణాలమీద అఖండమైన గురి లేనివాడు కాబట్టి, అతను మర్నాడు గేటుమీద బోర్డు కట్టి, దానిమీద ఇలా వ్రాశాడు

"నిన్న రాత్రి ఈ హాలులో వందరూపాయలనోటు పారేసుకున్న ఆసామి, ఇవాళ సాయంకాలం 4 గంటలకి టిక్కెట్ల ఆఫీసుదగ్గిర క్యూలో నిల్చోవలసిందని ప్రార్థన"

# ★ కోతి; కొమ్మంచి ★



"ఎంతదూర మీ ప్రయాణము తిమ్మయ్యా?"
నా పేరెలా తెలిసిందిర తిమ్మయ్యా?"
'పేరే చెప్పడమెందుకు రన్నయ్యా!
నీ మొహామే తెల్పును తిమ్మయ్యా!'



చెలిమి
కలిమి







★
"వహ్వా
నా
అందం"



# మంత్రాలు: నమ్మకాలు

## కుక్క ముట్టిన కుండ

మిర్యాలగూడెమునకు దాదాపు 20 మైళ్ళ దూరములో ఒక చిన్న గ్రామం ఉంది. అచ్చట ఒక రెడ్డి 'యినాందారు' ఉండేవాడు. స్త్రీ వ్యసనమే అతని దుర్గుణం. ఒక అయ్యవారు ప్రతి సంవత్సరము వచ్చుచున్నట్లే ఆ సంవత్సరము కూడా యాచనకు వచ్చాడు. అవి జనవరి రోజులు, పంట కోతకు వచ్చింది. అసలే గదా అయ్యవార్లకి 'గిరాకీ' రోజులు. కాని ఈసారి అయ్యవారు భార్యాసమేతంగా వచ్చారు. ఆచార ప్రకారం రెడ్డిగారు వారికి బసకు ఒక పూరిల్లు చూపాడు. రెండు రోజుల అనంతరము ఆయన ప్రక్కవూరికి యాచనకు వెళ్ళుతున్నట్లు, రెండు రోజులవరకు తాను రానట్లు భార్యతో చెప్పాడు. భార్య "నేను కూడ మీతో వస్తాను నాకేమో భయంగా ఉంది" అంది. "భయంలేదు, అన్నీ ఉన్నాయిగా వంటకి," అని ఎన్నోవిధాల ఆమెకు నచ్చచెప్పి బయలుదేరాడు ప్రక్క గ్రామానికి. పోతూ, పోతూ, తను ప్రక్క ఊరికి యాచనకు వెళ్ళుతున్నట్లు, తన భార్యను విడిచి వెళ్ళుటకు కాళ్ళు ఆడుట లేదని, అయ్యవారు రెడ్డిగారితో చెప్పాడు. "మేం జాగ్రత్తగా చూస్తాం- నీవు ఫికరు చేయకు" అని బుజగించారు రెడ్డిగారు. విచారిస్తూనే ప్రక్కవూరికి పోయాడు.

మంచి మంచి లేత బీరకాయలు గుమ్మడికాయలు, చిరుసాంబల బియ్యం, శేరు ఆవు నెయ్యి పంపారు రెడ్డిగారు ఓ నౌకరుతో. సాతాని యింటికి తాను పంపించినట్లు చెప్పవద్దని, సాతాని పోతూ పోతూ పంపాడని చెప్పమన్నారు నౌకరుతో రెడ్డిగారు.

సాతాని స్త్రీపై కన్నేసిన ఆ యినాందారు యిదే అదను అనుకొన్నాడు. ఆనాటి పగలంతా సూర్యుణ్ణి తిట్టుకొంటూ కూర్చొన్నాడు.

సరిగా అర్ధరాత్రికి రెడ్డిగారు నవాబువలె ముస్తాబై సాతాని బస గృహానికి జేరారు. కిటికీలోనుంచి లోపలకు చూశాడు. ఆమె గాఢ నిదురలో ఉంది. మెల్లిదిగా తలుపు తోసుకొని లోపలకు నడిచారు రెడ్డిగారు. విధివశమున అప్పుడే యింట్లోని దీపము గాలికి ఆరిపోయింది. బయట మంచు వాతావరణము, ఇంటిలో చీకటి ఇవన్నీ రెడ్డిగార్ని మరింత రెచ్చగొట్టాయి. రెడ్డిగారు, తమ కోరిక తీర్చుకొని తమ భవనం జేరుకొన్నారు.

సుమారు మూడు గంటలకు పొరుగూరిలో ఉన్న సాతానికి నిదుర పట్టక పొలుటా పొలుటన భార్యను జేరుకొన్నాడు. "కుండను కుక్క ముట్టింది" అని ఆమె భర్తతో చెప్పింది. అంతే! సాతాని ఎవ్వరికీ తెలియకుండా భార్యతో కృష్ణకు బయలుదేరాడు. కృష్ణానది 62 మైళ్ళ దూరముంటుంది.

కృష్ణాతీరము చేరేసరికి తెల్లవారింది. నదిలో భార్యాభర్తలు స్నానము జేశారు. పిదప భార్యను క్రింద పరుండబెట్టి ఆ సాతాని ఏమో మంత్రాలు చదువుతూ పసుపునీళ్ళు ఆమెపై జల్లాడు. మరుక్షణములో ఆమె ఈ లోకమును వీడింది. శవాన్ని నదిలో పారవేసి తాను తిరిగి స్నానము చేసి, తడి అంగవస్త్రము క్రింద యిసుకలో పరచి, ఏవో మంత్రాలు చదువుతూ, తన ఎడమతొడను చీల్చుకొన్నాడు. ఆ రక్తముతో ఒక తాటఆకుపై ఏదో మంత్రము వ్రాసి, తిరిగి పన్నెండు గంటల మధ్యాహ్నం వరకు మంత్రాలు చదువుతునే ఉన్నాడు. అనంతరము ఒక శక్తి వచ్చి ఆ వ్రాసిన తాటపత్రమును తీసికొని, మనిషిరూపము దాల్చి బయలుదేరింది అతని ఆజ్ఞపై రెడ్డిగారి (గూడెం) గ్రామానికి.

మనుష్యరూపమున ఉన్న శక్తి అచ్చటకు చేరునప్పటికి రెడ్డిగారు పంగుంపుల నములుతూ, ముఖము కడుగుకొనుట కుపక్రమించారు (తెలంగాణాలోని చాలమంది పల్లె ప్రజలు 12 గంటలు కొంగే ముఖము కడుగుకోరు) వెంటనే రెడ్డిగారు మనిషి యిచ్చిన తాటపత్రము చదువుకొన్నాడు. అంతే! మానెడు రక్తము కక్కి మరణించాడు. ఆవూరికి యిప్పటివరకూ ఆ సాతాని రాలేదు. ఇప్పటికీ యిచ్చట ఈ సంఘటనను చెప్పుకొంటారు.

ఎస్. ఉమాకృష్ణ-
(నల్గొండ) మిర్యాలగూడెము

* * *

### తీరని కోరిక

గుంటూరునుండి బెజవాడ పొయ్యే రోడ్డులో నంబూర్ స్టేషన్ తర్వాత, చాలపురాతనమైన మర్రిచెట్లూ, చింత చెట్లూ వాటినీడలో ఒక సత్రం. ఆ సత్రం ప్రక్కనే ఒక గిలకబావి మనకు కనిపిస్తాయి. ఈ సత్రం "దొరసాని సత్రం" పేరుతో యిప్పటికీ పిలువబడుతూంది.

ఒకరోజు గుంటూరులో సినిమా చూచి తిరిగివస్తున్న యిద్దరు యువకులు ఏవో సినిమా సంగతులు చెప్పుకుంటూ సైకిళ్ళు మెల్లగా పోనిస్తున్నారు. సత్రం దగ్గిరపడుతూంది. వెన్నెలరాత్రి. సత్రంముందు ఎవరో మంచి వయస్సులో వున్న యువతి నిల్చొనివుంది. ఎవరో సత్రంలో విడిదికి దిగివుండవచ్చుననుకున్నారు యువకులు. కాని రాత్రి 12 గంటలు దాటిన తర్వాత బయట అలంకరించుకొని నిల్చోవలసిన అవసరం ఏమిటి అన్న అనుమానంకూడా వారిని పీడించక పోలేదు. నిశ్చలంగా నిల్చొనివున్న యువతి కదలి ముందుకు వచ్చింది. సైకిళ్ళు దగరికి వచ్చేసరికి "ఏమండీ! మిమ్మల్నే ఒకసారిలా వస్తారా!" అంటూ పిలిచింది.

"ఇదేమిటి ఎవరిని పిలుస్తూంది" అని ఒకరి మొఖం ఒకరు చూసుకున్నారు మిత్రులిద్దరు.

"మిమ్మల్నేనండి ఒకసారి యీ సత్రందాకా రండి!"

వెంటనే ఆ యువతి ననుసరించారు. పోతూ, పోతూ యువతి ఒకయువకుడివైపు చూస్తూ "మీరిక్కడ కూర్చోండి మీరటూ నాతో రండి" అంటూ రెండో యువకుణ్ణి తీసుకొని సత్రం వెనుకభాగంలో ఆరుబయట వేసివున్న మంచం దగ్గరికి తీసుకొని పోయింది. కాని యువకుడి హృదయంలో ఏదో భయం, బాధ మొదలయ్యాయి. వణికిపోతున్నాడు "ఏమిటే బాధ. ఏమిటీవింత" అనుకుంటూ తెల్లబోతున్నాడు. యువకుడు చివరికి యువకుడు మెత్తబడ్డాడు. ఆనందంగా ఆ రాత్రి గడిపాడు. తెలవారుతుండగా మిత్రుడు గాభరాగా వచ్చి "ఏరా! బాబూ! ఏమిటిరా! యీ మొద్దు నిద్ర యిలా సత్రం వెనుకబడి నిద్రపోతున్నావు?" అంటూ లేపేసరికి గాభరాపడి

# ★ మంత్రాలు, నమ్మకాలు ★

లేచాడు సత్రం అంతా వెతికినా ఒక్క పురుగయినా కనిపించలేదు. తెల్లవార్లూ ఏదో ఆనందంతో గడపిన యువకుని హృదయం గడ్డకట్టుకుపోయింది అప్పుడు సైకిలెక్కిన యువకులు తెల్లవారకుండా యింటికొచ్చి పడ్డారు జరిగిన కథంతా చెప్పారు నమ్మినవాళ్లు నమ్మారు లేనివాళ్ళు లేదు కాని అసలు కథ యిది. బ్రిటిష్ పాలకులకు సర్కారులు అప్పగించబడిన రోజుల్లో బ్రౌను దొర అనే ఒకాయన యిప్పుడు సత్రం వున్న స్థలం చక్కగా వుండటం చూచి అక్కడొక సత్రం లాంటిది కటించి కొంతకాలం అక్కడే కాపురమున్నాడు ఆ రోజుల్లోనే ఆయన కూతురు ఒక సంబూరు యువకుణ్ణి ప్రేమించింది ఈ ప్రేమ అంతిమఘట్టాన్నందుకోకముందే "బ్రౌనుదొర" అక్కడినుంచి మకాము మార్చిన కొద్దిరోజుల్లోనే చనిపోయింది ఆ రోజునుంచి తీరని తన కోర్కె తీర్చుకునేందుకుగాను ఆ ప్రాంతంలో సంచరిస్తూ కంటికింపుగా కనుపించిన యువకులను బాధపెడుతుందని నలుగురూ చెప్పుకుంటున్న కథనం

పట్టెల విజయలక్ష్మి

అంబం-నిజామాబాదుజిల్లా

* * *

## మంత్రమా! తంత్రమా?

నేను పార్శ్వపు నొప్పితో బాధపడ్డాను అది ప్రతిరోజూ ఉదయం 8 గం॥ల ప్రాంతంలో ప్రారంభించేది భోజనం చేసిన తర్వాత 11 గం॥ల ప్రాంతంలో తగిపోతుండేది ఈ ప్రకారం 40 రోజులదాకా వచ్చింది ఈ లోపున రెండు మూడు రకాల వైద్య చికిత్స పొందాను కాని ఏం ప్రయోజనం కలుగలేదు ప్రతిరోజూనా వస్తూనే ఉంది

తూర్పు గోదావరిజిలా అమలాపురం తాలూకాలోని నడవపల్లి గ్రామంలో ఒక కంసాలి పార్శ్వపు నొప్పికి మంత్రం వేస్తాడని తెలియగా అచటికి వెళ్లినాను నాకున్న బాధ అతనితో చెప్పినాను కిరసనాయిలు డబ్బాకు పైని పట్టుకోడానికి ఉండే కొండీ ఒకటితీసి, దానితో నా కాలి బొటనవ్రేలికి పరిపోయేటట్టు ఒక చుట్టు తయారుచేసి, దానిని మంత్రించి, నా కుడి బొటనవ్రేలికి తొడిగినాడు ఒక వారం రోజుల వరకు దానిని తీయవద్దన్నాడు అంతే. ఆ మరునాడుగాని, అప్పటినుండి ఇప్పటివరకూ గాని తిరిగి పార్శ్వపు నొప్పి రాలేగు ఇది జరిగి ముప్పది సంవత్సరాలు అయింది అప్పుడు నేను కాలేజిలో చదువుకొంటున్నాను ఇది చాల అద్భుతంగా కనబడింది

ఇది మంత్రమా? తంత్రమా? నాతో కూడా వచ్చిన మా బావమరది అన్నాడు "అతగాడి మంత్రం అమోఘం" అని నే నన్నాను "అది మంత్రం కాదు, తంత్రమోయీ వాడు ఉచ్చరించిన మంత్రంలో ఏమీ లేదు వాడు కాలికి వేసిన ఉంగరంలో పార్శ్వపు నొప్పిని తగ్గించే తంత్రమేదో ఉం"దని నా భార్య అంటుంది "అది కేవలం కాకతాళీయం" అని

పి వి సూర్యనారాయణమూర్తి,

— కాకినాడ

* * *

## మంత్రాలున్నాయి

మా నాన్నకు మంత్రాలొచ్చు ఒకమారు ఒక కూలివానికి నాగుపాముకరిచింది స్పృహతప్పి పడిపోయిన వానిని మా నాన్నదగ్గరకు తీసుకొచ్చారు పాము మంత్రం వేసిన అరగంటకల్లా వాడు లేచాడు ఇంతవరకూ మా నాన్న వేసిన పాము మంత్రాలు తప్పిపోకుండా మంచి ఫలితాలనిచ్చాయి మా పిన్నిది ఊరుగొండ గ్రామం ఆమెకు ఇద్దరు మరదులుండేవాళ్లు వీళ్ళ పాలివాళ్ళకి, వీళ్ళకీ, మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేది వీళ్ల పాలివాళ్లలో మంత్రాలొచ్చిన వాడు ఒకడు ఉండేవాడు అతడు మా పిన్ని మరుదుల పైన చాతబడి మంత్రం ప్రయోగించి, "శనివారంనాడు పెద్దవాడు, మంగళవారంనాడు చిన్నవాడు చనిపోతా"రని బాహాటంగా ప్రకటించాడు (ఈ సంగతి 20 ఏళ్ల క్రితం జరిగింది అప్పుడు ఆ వూరి వాళ్లంతా మంత్రాలొచ్చిన వాడి మాటకు ఎదురు చెప్పడమంటే భయపడేవాళ్లు మరి!) అతడు ప్రకటించినట్లే శనివారంనాడు పెద్దవాడు, మంగళవారంనాడు చిన్నవాడు వాంతులు చేసుకుని మరణించారు ఇటువంటి సంఘటనలు ప్రత్యక్షంగా చూసినవాళ్లుండగా ఎలా మంత్రాలు లేవనుకోవటం? మంత్రాలున్నాయి.

గంట రామారెడ్డి,

—మామునూరు గ్రామం,

(ఓరుగల్లు జిల్లా)

* * *

కాస్త బొద్దుగావుండే ఒకాయన, బస్సీలో రైలుదిగి ఒక నాసిరకం హోటలుకి వెళ్లాడు మహానగరంనుండి వచ్చాడు కాబట్టి ఆయన కది నచ్చలేదు. అయినా అక్కడ బస చెయ్యక తప్పలేదు

"హుఁ ఈ బందెలదొడ్డిలో గదికెంతపుచ్చుకుంటున్నారు?" అన్నాడు ఈసడించుకుంటూ

"ఒక గొడ్డుకైతే రెండు రూపాయలండి రెండైతే మూడు పుచ్చుకుంటాం" అన్నాడు మానేజరు అదే ధోరణిలో.

## మంత్రాలు; నమ్మకాలు

### అందుకనా బ్రతకరేం!

నేను నాలు గైదు సంవత్సరముల నుండి మంత్రముల ప్రభావములు చూస్తున్నాను పాముకాటు వేసిన వారిని తెనాలి రైల్వే స్టేషనుకు తీసుకువెళ్ళ మంత్రగాళ్ళకు చూపు చేసేవారు ఇదిగు ముగ్గురు చనిపోవటము ఒకరిద్దరు బ్రతకటము చూసినాను "పాముల నరసయ్య వెలుస్తూ ఉన్నాడు" అని అతని చెవిలో చెప్పేవారు కొందరు బ్రతికి, కొందరు చనిపోయినారు ఎందువల్ల అని అందరికి సంశయం. పాము కరచిన చోటును పరిశీలించి నరములమీద కాటు వేసినవారు బ్రతికినారు కండరముల మీద కాటువేసిన వారు చనిపోయినారు డాక్టరును విచారించగా 'పాయిజను ఇంజక్షను' నరములకు చేయుదురు అదే కండరములకు చేసే చనిపోవుదురు అని చెప్పినారు. పాము కాటుగూడ అలాగే పని చేయును మీరు గూడ పరిశీలించి మంత్రమో తంత్రమో తెలుసుకోండి పాముల నరసయ్య అని చెవి వద్ద చెప్పుటచే రోగికి భయముపోయి కొంచెము తెప్పరిల్లును ఇంతకు 'మనస్తత్వము' ప్రధాన కారణము మంత్రమే నిజమైన అందరు ఎందుకు బ్రతుకరు? ★

వేములమడ సత్యనారాయణ,
తెనాలి

# గృహిణీ ప్రణయం

గత సంచిక తరవాయి

## ౭

ఆ మరునాడుకూడా ఇందుశర్మకు వారుణి దర్శనం కాలేదు కాని ఆమె పరిచారిక అతనినెంతో ఆప్యాయంగా ఆదరించింది వారుణి తల్లమాలిన శిరోవేదనతో బాధపడుతున్నదనీ నాటికి మన్నించవలసిందనీ ఆ మరునాడు తప్పక విచ్చేయవలసిందనీ ప్రార్థించింది ఇందుశర్మ ఉసూరుమని తిరిగి వచ్చివేశాడు కాని ఆ మరునాడైనా వారుణి దర్శనం దొరకకపోదనీ కేవలం దురదృష్టంవల్లనే ఆనాడు దర్శనం కాలేదనీ అనుకొన్నాడు ఇంటికి తిరిగివచ్చి ఆ విషయం కొంచెం చూచాయగా దామోదరభట్టుతో అన్నాడు దామోదరభట్టు వ్యంగ్యంగా నవ్వాడు "నేను చెప్పలేదటయ్యా! ఆమె దర్శనం దొరకదని ఇంకానయం నీ కామె దాసీ దర్శనమైనా దొరికింది చాలా మందికి ఆమె గుమ్మంలో అడుగు పెట్టడానికి కూడా ఆస్కారం కలగలేదు!"

అయినా ఇందుశర్మ అధైర్యపడలేదు!

"చూడు! రేపు వారుణితో ముఖాముఖీగా ప్రసంగించి తీరతాను!"

"ఏమో నాకు నమ్మకం లేదు సుమా! ఎందుకీ అప్రతిష్ఠవ్యవహారం! నా మాట విని తిన్నగా ధాన్యకటకానికి వెళ్ళిపో!"

అలాగ సదుపదేశం చేసినకొద్దీ ఇందుశర్మ మరింత పట్టుదలతో పనిజేస్తాడని దామోదరభట్టుకు తెలియకపోలేదు అందుకనే అతనలాంటి సదుపదేశం చేశాడు ఇందుశర్మవంటివాళ్లు కొంచెం దుర్వ్యసనాల్లోపడితే ఆ దుర్వ్యసనాల దుర్వ్యయాల ఆసరాతో దామోదరభట్టు తన సంసారయాత్ర సాగించుకొంటూ ఉంటాడు కనకనే అతనికి ఇందుశర్మ బాగా పెడదారి పట్టేదాకా కంటికి కునుకు పట్టలేదు ఇంతవరకు వచ్చిన తరవాత ఈ వారుణీవ్యవహారం అంతు చూసి తీరాలని అతడు గట్టిగా సంకల్పించాడు అందువల్ల ఎంతో హితైషిలాగే నటిస్తూ ఆ విధంగా హితోపదేశం చేశాడు అనుకున్నట్టుగానే ఇందుశర్మ మరింత తాడుబారిపోయాడు

"చూడు వారుణి వ్యవహారం కొంచెం చెవినిపడగానే బాలచంద్రిక 'సహేంద్ర తక్షకాయస్వాహా!' అన్నట్టుగా తండ్రిగారిని వెంటబెట్టుకుని మరునాటి కిక్కడికి వాలిపోతుంది!"

అని తన బుద్ధిచాతుర్యానికి తానే మురిసిపోతూ ఒక్క చిరునవ్వు చిలకరించాడు దామోదరభట్టు 'ఆఁ చూదాంలే' అని దప్పరించేశాడు.

"దానికేంలే ఎందుచేతనో వారుణి నిన్నిన్ని మాగాలు తిప్పింది కాని నీకీపాటికి దేవిడీ మన్నా జరిగితీరవలసిందే బహుశః రేపటితో నీ కా సత్కారం జరిగిపోతుందనే నా నమ్మకం"

"అదేదో నేను చూస్తానుగా!" అన్నాడిందుశర్మ ఆనాటి సాయంత్రం కూడా యథాప్రకారంగా వారుణి భవనానికి బయల్దేరాడు

మొట్టమొదట వారుణిని మేడమీద చూచినప్పటినించీ అతని పాదాలు అప్రయత్నంగా అటువైపే సాగిపోయేవి దూరదూరంగానైనా వారుణి ముఖం కనబడక ఒక్కమారు కంట బడగానే అతని హృదయంలో ఏదో నూతనచైతన్యం ప్రవహించినట్టుండేది కావ్యగోష్ఠిలో నాయికానాయకుల విరహవర్ణనలు విని అతడవన్నీ వట్టి అభూతకల్పనలనీ అతిశయోక్తులనీ కొట్టిపారవేసేవాడు ఇప్పుడా వర్ణనలన్నీ అతనికి కేవలం స్వానుభవోక్తులుగా స్ఫురించాయి ఆనాటి కానాటికతని ఉత్కంఠ పెచ్చుపెరిగిపోయింది ఎలాగైనా వారుణి నొక్కమారైనా చూడనిదే అతనికిక నిద్ర పట్టేది కాదు గాఢనిద్రలోకూడా ఆమె ముఖప్రతిబింబం అతని హృదయంలో అలవోకగా మెరుగులు తున్నట్టే ఉండేది

## ప్రాచీన గాథాలహరి

పి. గణపతిశాస్త్రి

వారుణీభవంతి గుమ్మంలో అడుగు పెడుతూంటే అతని హృదయం గట్టిగా కొట్టుకుంది

అయితే ఆనాటి సాయంత్రమే అతనికి వారుణీ దర్శనం దొరికింది ఆమె అతని కెదురుగా ఎంతో ఠీవిగా ఒక రత్నకంబళం మీద కూర్చుని నిశ్చల దృష్టితో అతనివైపు చూచింది దీపకాంతిలో ఆమె ముఖంమీది సరిగంచు మేలిముసుగొక సన్నని పైడివలలా కదిలింది ఆమె వర్తుల విశాల నేత్రాలా మేలి ముసుగులో వలలోపడిన మీనుల్లా మెరిశాయి కరకంకణాలు, కర్ణతాటంకాలు, కంఠహారాలు దీపకాంతులలో ధగధగా మెరిసిపోయాయి

మొదటి చూపులోనే 'ఎంతటి అందగత్తె' అనే భావం అతని హృదయంలో దూసుకుపోయింది పరిచారికలతనికి కర్పూర తాంబూలాదులందించి ఎంతో మర్యాద చేశారు

వారుణి గడిచిన రెండు రోజులలోను ఆశాభంగం కలిగించినందుకు మన్నించవలసిందనైనా అనలేదు ఒక చిరునవ్వు నవ్వింది

"మీ విద్వత్తు విషయం కొంచెం మా దాసి చెప్పగా విన్నాను నేటికిలాగ మీ వీణావాద్యం వినే భాగ్యం కలిగింది"

ఆమె వినబడీ వినబడనట్లుగా ఒదుగులుపోతూ మాట్లాడింది 'వారకాంతలిలాగే అతి ముగ్ధత్వం నటిస్తారు కాబోలు' అనుకున్నాడిందుశర్మ.

అతడంతకు పూర్వం పేరుమోసిన గణికలను గురించి కొంచెం కర్ణాకర్ణిగా విన్నాడు ధనాశతో వారిని వశపరుచుకోవడం చాలా కష్టం మహామంత్రులు రాజబంధువులు, సేనాధినాయకులు మొదలైన మహామహులకే వారి సౌందర్యం చవిచూచే అదృష్టం కలుగుతుంది వారుణికూడా ఆ కోవకు చెందిన వారకాంతే కావచ్చునని అతడూహించాడు కాని ఆమె ఠీవి, అందం చూచిన ఉత్తరక్షణంలో ఆ రాజవేశ్యలందరు ఆమె కాలిగోటికి కూడా సరిపోలరని అనిపించింది

అంతలో ఒక దాసి వీణ తెచ్చి అతనిముందుంచింది ఇందుశర్మ శ్రుతులు సరిచేశాడు. అతని వేళ్ళు వీణతీగలపై పరుగులు పెట్టటం మొదలు పెట్టాయి క్రమంగా ఆ పరిసరాలలో అంతటా వీణా ఝంకారాలు, అగరుధూపమాలికలు అల్లిబిల్లిగా అలుముకుపోయాయి.

# ★ గృహిణీ ప్రణయం ★

అలాగ రెండుమూడు గడియల వరకు అతని వీణా వాద్యం సాగిపోయింది

ఇందుశర్మ తన యావచ్ఛక్తి వినియోగించాడు ఆమె మెప్పు పొందవలెనని ఎంతో తహ తహలాడిపోయాడు కొంచెం సేపటికామె మెచ్చుకుంటున్నట్టుగా తలపంకించింది అంగుళ్ళ ఆమె మేలిముసుగు కొంచెం కదిలింది ఆమె విశాల నేత్రాలు నిజ స్వరూపంతో అతని కెదురుగా ప్రత్యక్షమైనాయి అంతలోనే ఆమె మళ్ళీ తన మేలిముసుగు సవరించుకుని అతని గానా వ్యాసంలో పడింది

కొంత సేపటికతని వీణాగానం ముగిసింది అంతలో ఒక పరిచారిక రత్నాలు పొదిగిన ఒక ముంజేతి కడియం బంగారు పళ్లెరంలో పెట్టి అతి మర్యాదగా అతని ముందుంచింది అతడది చూచి నిర్ఘాంతపోయాడు

"మా పూర్వులెందరెందరో వైణిక విద్వాంసుల నాదరించి విద్వత్ప్రశంసలనే మహాప్రసిద్ధి వహించారు అంతేనే గాని ఒకరివల్ల బహూకృతులు పొందే ఆచారం మాయింటా వంటా లేదు ఎందుకు నాకీ బహుమానం. ఇంతా చేస్తే ఇది వారుణి కటాక్ష వీక్షణాలేశంతో కూడా సరిపోలదు"

అని అది స్వీకరించడం తనకిష్టం లేనట్టు సూచించాడు

"వారుణీ కటాక్ష వీక్షణం వల్లే మాకీ మహా గౌరవం కలిగింది దయచేసి స్వీకరించండి ఇలాగ తిరస్కరించడం మర్యాదేనా?"

అని ఆ పరిచారిక మళ్ళీ బలవంత పెట్టింది

వారుణి కొంచెం తలవంచి క్రీగంటితో అతనివైపు చూచింది

"శ్రీమంతులైన మీవంటి విద్వాంసులకు మేమేమి బహూకరించగలం అయినా చంద్రునికిది ఒక చిన్న నూలుపోగన్నట్టుగా స్వీకరించండి!"

అని స్వయంగా ఆ ముంజేతి కడియం అతని చేతి కలంకరించింది ఆమె హస్త స్పర్శతో ఇందు శర్మ కిక ఒంటిమీద స్పృహతప్పిపోయింది ఆపైన ఆమె 'ఇందు శర్మ' అనే పదం శ్లేషించి 'చంద్రుని కొక నూలుపోగ'ని చమత్కరించింది! ఎంతటి నెరజాణ!

తరవాత అతడింటికి బయలుదేరాడు వారుణి వీధిగుమ్మందాకా వచ్చి అతనెంతో ఆప్యాయంగా సాగనంపింది అంతే గాని మాట వరసకైనా మళ్ళీ ఒకమారు విచ్చేయవలసిందని ఆహ్వానించలేదు అతడా ముంజేతి కడియం తడిమి చూచుకొని ఒక్క నిట్టూర్పు విడిచి తన భవంతికి వెళ్ళిపోయాడు



ఆ మరునాటి ఉదయమే దామోదరభట్టు ఇందు శర్మ భవంతికి బయలుదేరాడు ఇందు శర్మ కానాటి రాత్రి అంతా నిద్రపట్టలేదు వారుణి స్వయంగా తన చేతితో అతని ముంజేతికి ఆ కడియం అలంకరించింది అయితే ఏమిలాభం ఆ బహూకృతితో అతనికిక వారుణి భవంతికి వెళ్ళే అవకాశం కాస్తా చెయ్యిదాటిపోయింది ఇక మళ్ళీ అక్కడికి వెళ్ళడానికతనికి దారిదొరకలేదు ఆ మథనతోనే అతనికా రాత్రి అంతా నిద్రపటలేదు ఆపైన దామోదరభట్టతని దగ్గిరికి వచ్చి సాధిక్షేపంగా ఒక వికపు నవ్వు నవ్వి గట్టిగా కవ్వించాడు

"ఏం సరిగ్గా నేను చెప్పినట్టే జరిగిందా? అక్షరాలా అంతే జరుగుతుందిలే!"

ఏమిటయ్యా! నువ్వనేది? ఇదుగో! ముంజేతికి రత్నకంకణం బహూకరించింది వారుణి చూసుకో!"

అన్ని మళ్ళీ కవ్వించాడిందుశర్మ అది చూచి నిలువునా నిర్ఘాంతపోయాడు దామోదరభట్టు

"ఇది నిజంగా నీ విద్వత్తుకోసమే బహూకరించిందా?"

"కాకపోతే ఏమిటనుకున్నావు!"

అని మళ్ళీ కవ్వించాడిందుశర్మ అయినా అతనికే అది తన విద్వత్తు చూచి చేసిన బహూకృతి అనే నమ్మకం కలగలేదు అతడా నాటి రాత్రి జరిపిన వీణాగోష్ఠి మొత్తం మీద బాగానే ఉంది గాని అంత రత్నకంకణ బహూకృతి చెయ్యవలసినంత ప్రశస్తంగా లేదు ఆ సంగతి ఇందుశర్మకు తెలియక పోలేదు దామోదరభట్టు కా సంగతి అంతకు పూర్వమే తెలుసును భట్టు బాగా ఆలోచించి మళ్ళీ అడిగాడు "ఈ బహుమానానికేమిగాని నిన్ను మళ్ళీ రమ్మని ఆహ్వానించిందా?"

ఇందుశర్మకు తన పరాజయం అంగీకరింపక తప్పలేదు! మళ్ళీ ఆహ్వానించలేదని వాచా అంగీకరించాడు దామోదరభట్టు మళ్ళీ వెటకారంగా నవ్వాడు

"నేను చెప్పలేదూ! ఆ కడియం చేతికి తగిలించి చల్ల చల్లగా నిరు సెవిడేసున్నా చెప్పింది అంతే నేను చెప్పలేదూ? నా మాటవిని ఇప్పుడైనా మాను గారి కాళ్ళమీద పడు!"

అని అలాగే పకపక నవ్వుతూ అక్కడి నించి నిష్క్రమించాడు

ఆ ఎత్తిపొడుపుతో ఇందుశర్మ గుండె రక్తం కళ్ళకెక్కింది అయినా అతను నిరుత్సాహ పడలేదు ప్రతిరోజూ సూర్యాస్తమానం కాగానే చక్కగా ముస్తాబై వారుణి భవంతిముందు అటూ ఇటూ పచారులు సాగించేవాడు ఒకనాటి సంజెవేళ తలవని తలంపుగా అతనికామె చిరునవ్వు సందర్శించే భాగ్యం కూడా కలిగింది దానితో అతనిక మళ్ళీ ధైర్యం కలిగింది

వెంటనే ఒక పరిచారికను వారుణి భవంతికి పంపించాడు తనకు వారుణి వీణాగానం వినవలెనని ఉన్నదని ఆమె చేత చెప్పించాడు ఆ పరిచారిక వెళ్ళిన కొంత సేపటిలోనే తిరిగి వచ్చింది

"ఆ అమ్మగారే మీ వీణాగానం ఇంకొకమారు వినవలెనని కుతూహల పడుతున్నారట! రేపు కౌముదీ మహో[illegible]ం గదా! రాత్రికి తప్పకుండా విచ్చేయ వలసిందని కోరుతున్నారు"

అని వారుణి సందేశం అతనికి వినిపించింది

ఆ మరునాడే పుష్య పూర్ణిమ ఇందు శర్మ సూర్యాస్తమయం కాగానే చక్కగా వేషం వేసుకొని చాటు చాటుగా వారుణి భవంతికి వెళ్ళిపోయాడు

ఆనాటి రాత్రి వారుణి ఇందుశర్మ

ఏకాంతంగా కూర్చున్నారు. అతని వీణా వాద్యం ఆ రాత్రి బాగా రక్తి కట్టింది.

వారుణి ఆ గాన తన్మయతలో లీనమై రెప్పవాల్చకుండా అతనివైపే చూచింది. వీణాగోష్ఠి ముగిసి పోగానే ఎందుకు చేతికి ఇంకొక రత్న కంకణం బహూకరించబోయింది. కాని ఇందుశర్మ ఆ బహూకృతి కంగీకరించలేదు. ఆమె అతని హృదయ భావం గ్రహింపకపోలేదు. కాని ఏమీ ఎరగనట్లె మళ్ళీ అతనికా రత్న కంకణం బహూకరించబోయింది. అతడి గత్యంతరం లేక ఆమె పాదాలపై వాలిపోయాడు. ఆమె ఎంతో ఆప్యాయంగా అతనిని లేవనెత్తింది.

అసలే హేమంతం. ఆపైన పుష్యపౌర్ణమి. ఆపైన వీణాగాన సమ్మోహంతో వారిద్దరి హృదయాలు మత్తెక్కిపోయాయి. ఇక ఏమి కావాలి? ఆనాటి రాత్రితో ఇందుశర్మ మానవానందానికి అవధి అందుకొన్నానని ఎంతో మురిసిపోయాడు. అటు పిమ్మట ఆ రాత్రి అతనికిక శరీరంమీది స్మారకమే తప్పిపోయింది. నాటిరాత్రి అంతా అతనికి ఏదో విచిత్రమైన అనురాగ మహేంద్రజాలం జరిగిపోయినట్లనిపించింది.

ఆ వేళతోనే అతనికి ప్రప్రథమంగా వేశ్యా ప్రసంగపరిచయం కలిగింది. అంతగా సాహసించినా అతని హృదయంలో ఇంకా అప్రతిష్ఠ భయం తొలగిపోలేదు. అందుచేత మరునాడు తెల్లవారగట్లే లేచి, అతికష్టం మీద వారుణి గాఢాశ్లేషబంధనం విడిపించుకొని, రెండోకంటవాడికి కనబడకుండా చాటుమాటుగా ఇంటికి చేరుకున్నాడు. ఆ నాటింతో అతని హృదయం గడిచిన రాత్రి ఆనందానుభూతిలోనే ఓలలాడింది.

౭

మరునాడిందు శర్మ మళ్ళీ వారుణి భవనానికి బయలుదేరాడు. ఈసారి వారుణికి బహూకరించడానికని కొన్ని అమూల్యమైన ముత్యాల హారాలు, మణినూపురాలు తీసుకుపోయాడు. వారుణి అంతకు పూర్వమే శయ్యాగారంలో అతని కోసం ఎదురు తెన్నులు చూస్తోంది. దీప కాంతిలో మేలిముసుగులో తళతళలాడే ఆమె నేత్ర సౌందర్యం చూచి క్షణకాలం అతిడలాగే విస్తుపోయి నిలుచున్నాడు. తరవాత స్వయంగా తన చేతులతో ఆ రత్ననూపురాలామె పాదాల కలంకరించాడు. తనివిదీరా ఆమె రెండుపాదాలు ముద్దుపెట్టుకున్నాడు. లేచి నిలబడి ఆమె మేలిముసుగు కొంచెం తొలగించాడు.

"నీ వంటి మహా సౌందర్యవతిని నేనింతకు పూర్వం ఎక్కడా కనీవినీ ఎరగను!"

# ★ గృహిణీ ప్రణయం ★

అని ఆమె అరుణాధరం ముద్దుపెట్టుకోబోయాడు అంతలో వారుణి తనముఖం [illegible]ఉన మరి ఒక పక్కకు తిప్పివేసింది

"ఆఁ ఈ ఇచ్చకాల కేమి లెండి!"

"ఇచ్చకాలు కావు నిజమే వారుణీ!"

అని ఇందుశర్మ మళ్ళీ ఆమె పెదవి ముద్దుపెట్టుకోబోయాడు మళ్ళీ ఆమె ముఖం తిప్పివేసింది

"ఉత్తది! నేను చంద్రరేఖకన్న అందగత్తెనా? ఎందుకీ ఇచ్చకాలు!"

"నీకాసంగతి ఎవరు చెప్పారు?" అని నిర్ఘాంతపోయాడింగుశర్మ

"ప్రత్యేకంగా ఒకరు చెప్పాలా? నేను మీ వ్యవహారాలన్నీ ఒక కంట గమనిస్తూనే ఉన్నాను"

"అయితే చాలాకాలంనించే నామీద కన్ను వేశావన్నమాట!"

"అవును!"

"అయినా ఎంత బెట్టుసరిచేశావు? నీ వెంతటిదానివైనా తగుదువు" అన్నాడింగుశర్మ

"మాట తప్పించాలని చూస్తున్నారా? ముందుగా చంద్రరేఖ సంగతి చెప్పండి ఆమె నాకన్నా అందగత్తెనా?" అని మళ్ళీ నిలదీసి అడిగింది వారుణి

"ఆమె నీ కాలిగోటికి కూడా సరిపోలదు! మా ఆవిడ ఇంట్లో లేనప్పుడేమోనో చక అప్పుడప్పుడామె నృత్యం చూడడానికి మాత్రమే వెళ్ళేవాణ్ణి అంతే అంతకన్నా నేనేపాపము ఎరగను లోకులు కాకులు పదిమంది పది విధాలుగా నీలాపనిందలు పుట్టించారు దానికి నేనేమి చెయ్యను"

వారుణి మళ్లీ అడిగింది,

"ఓహో! అలాగా! మీ ఆవిడ ఇంట్లో ఉన్నపుడు మీరెప్పుడు చంద్రరేఖ ఇంటికి వెళ్ళలేదా?"

"ఏం అంతపరీక్షగా అడుగుతున్నావు?"

"అడగకూడదా? అంతగా అడగకూడని ప్రశ్న అయితే సమాధానం చెప్పనక్కర లేదులెండి"

అని వారుణి బుంగమూతి పెట్టుకుని కూర్చుంది ఇందుశర్మకిక సమాధానం చెప్పక తప్పలేదు

"అంత చెప్పకపోవడానికేముంది? ఆ రోజుల్లో కూడా ఆమె నృత్యం చూడాలని ఒకటి రెండుసారులు వెళ్ళానేమో అప్పుడైనా ఇంటలో కాలక్షేపంకాకే వెళ్ళాను అంతే"

వారుణి మళ్ళీ అడిగింది

"ఇంట్లో కాలక్షేపం కాకపోవడమేమిటి? మీ భార్య మీరంటే అంత ఆప్యాయంగా ఉండదా?"

"ఉండకేమి? నన్ను ఒక్క క్షణంకూడా విడిచిపెట్టి ఉండలేదు"

"లేకపోతే ఆమె అంత సౌందర్యవతి కాదేమో!" మళ్లీ అడిగింది వారుణి

"కాకేమి ఆమె అందగత్తెలలో లెక్క!"

"అయితే మీకింట్లో కాలక్షేపం కాకపోవడమేమిటి చెప్మా! అంతగా విద్యావంతురాలు కాదా?"

"కాకేమి? కొద్దో గొప్పో వీణకూడా వాయించగలదు" అన్నాడిందుశర్మ అంటీ అంటనట్టుగా

"అయినా మగవారికిల్లాలెంతటిదైనా రుచించదులెండి!"

అని వారుణి ఒక్క నవ్వు నవ్వింది తన ఇల్లాలిపై ఆమెకంతటి జాలికలగడానికి సరియైన కారణమేదీ ఇందుశర్మకు తెలియలేదు అది ఒక రకమైన నెరజాణతనం కావచ్చునని అనుకున్నాడు

"నీవు చాలా ప్రజ్ఞావంతురాలివే!"

"ఎందుచేత?"

"వారకాంతలెవరైనా పరసుల భార్యలపై జాలిపడతారా! నీ ప్రజ్ఞ దీనితోనే తెలిసింది"

అని కొంటెగా ఒక చిన్ననవ్వునవ్వాడు.

"అయితే నన్ను సామాన్య వారకాంతకిందే జమకట్టివేశారన్నమాట కొంచెం చనువిస్తే వారకాంతగతి ఇంతేలెండి!"

అని వారుణి మళ్ళీ బుంగమూతి పెట్టింది

ఇందుశర్మ తిరిగి ఆమెను కాళ్లావేళా పడి బతిమాలుకొన్నాడు వారుణి మళ్లీ ఎంతో ఆప్యాయంగా అడిగింది

"మీ ఇంటి ఆవిడ ఒకసారికళ్లారా చూడాలని ఉంది నాకొకమారు చూపిస్తారా?"

"ఎందుకో?"

"మీ వంటివారికి గృహిణి కావడానికెన్ని నోములునోచిందో ఆ ఇల్లాలు! ఆమె ఎలాగ ఉంటుందో ఒక్కమారు చూడాలని ఉంది"

"అన్నీ మంచిగుణాలేగాని అస్తమానం రుసరుసలాడుతూంటుంది"

"ఎందుకని?"

"నేను కొంచెం ఇంటికి ఆలస్యంగా వస్తానని నామీద వలమాలిన అనుమానం"

"అవును మరి! మీ రేమైనా సామాన్యులా? ఆమె ఇప్పుడెక్కడ ఉందో?"

"ధాన్యకటకంలో"

"ఆమె పేరు?"

"బాలచంద్రిక"

"కాదీ పూర్వం ధాన్యకటకమే ఆమె నెక్కడో చూచినట్టున్నాను పేరుకూడా విన్నట్టుంది"

అని వారుణి ఒక్క నిమిషం నేపలాగే ఆలోచించింది ఇందుశర్మకా ప్రస్తావనతో బాలచంద్రిక సంగతి బాగా జ్ఞాపకం వచ్చింది అతనికికూడా వారుణి నెక్కడో చూసినట్టే స్ఫురణ కలిగింది

"నిన్నెక్కడో చూచినట్టున్నానే"

అని తదేకదృష్టితో ఆమె వైపు చూచాడు

"ఎప్పుడైనా మీ మామగారింటికి వచ్చినపుడు ధాన్యకటకంలోనే చూచి ఉంటారు అంతే"

## ౧౦

అని వారుణి నెమ్మదిగా మేలిముసుగు పూర్తిగా ముఖంమీదికి లాగబోయింది కాని అంతలో ఇందుశర్మ ఆమె మేలిముసుగు పూర్తిగా తొలగించి పరీక్షగా ఆమె చెక్కిలికేసి చూచాడు

"ఇదేమిటి కుడి చెక్కిలిమీద ఈ పుట్టుమచ్చ! నీవు నిజంగా బాలచంద్రికవే!"

అని ఇందుశర్మ అలాగే శిలాప్రతిమలా నిర్ఘాంతపోయాడు

వారుణి తలవంచింది "ఏం మీ బాలచంద్రికకే గాని ఇంకెవరికీ కుడి చెక్కిలిమీద పుట్టుమచ్చ ఉండకూడదా?"

ఇందుశర్మ మళ్ళీ కొంచెం పరిశీలనగా ఆమె అధరం కిందిభాగం పరిశీలించాడు

"ఇదిగో కింది పెదవి కింద కూడా ఇంకొక చిన్న పుట్టుమచ్చ ఉందే! నీవు ముమ్మాటికీ బాలచంద్రికవే! నేను నిన్ననే కొంచెం అనుమానించాను!" అని మళ్లీ నిలువునా నిర్ఘాంతపోయాడు వారుణి తలవంచి కాలిబొటనవేలితో నేలమీద రాసింది

"అవును మీరన్నట్టు నేను నిజంగా బాలచంద్రికనే! ఏం అయితే?" అని వంచిన తల మళ్ళీ పైకెత్తలేదు ఇందుశర్మ ఆమెను కొంచెం దూరంగా తొలగిపోయాడు

"ఇదేమిటి? బాలచంద్రికా! నీ విన్నాళ్ళనించీ పుట్టింట్లో లేవా? అయితే ఈ బుద్ధి నీకు స్వయంగానే పుట్టిందా? లేకపోతే ఎవరైనా బోధించారా?"

"ఏ బుద్ధి?"

"ఈ వేశ్యావృత్తి అవలంబించాలనే బుద్ధి?"

"కొంత నాకూ తోచింది. ఆ పైన విజ్జిక కూడా బాగా ప్రోత్సహించి అన్నివిధాలా సాయం చేసింది"

"విజ్జి కూడా ఈ ఇంట్లోనే ఉందా? నా కెప్పుడూ కనబడలేదే!"

"నేనే కనబడవద్దని చెప్పాను నా మాట మీద నమ్మకం లేకపోతే కొంచెం మేడ దిగి లోపలికి వెడితే మీకే కనబడుతుంది"

ఆ మాట వినగానే ఇందుశర్మ కేదో స్ఫురించింది తొందర తొందరగా మేడమెట్లు దిగి భవంతి లోపలికి వెళ్ళిపోయాడు

బాలచంద్రిక చెప్పినట్టుగానే విజ్జిక లోపల ఒక మూలగదిలో కూర్చుని కునికిపాట్లు పడుతూంది ఇందుశర్మను చూడగానే ఆమె తటాలున లేచినిలబడింది

బాలచంద్రిక కూడా నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ అతని వెంట వెళ్ళింది ఒక అరుగడియసేపలాగే నిలబడింది మళ్ళీ ఇందుశర్మ తిరిగివచ్చే సందడి విని నెమ్మదిగా శయ్యాగారంలోకి వెళ్ళిపోయింది ఇందుశర్మ కలకల నవ్వుతూ ఆమె దగ్గిరికి తిరిగి వచ్చాడు.

"నాకు విజ్జిక అంతా చెప్పివేసిందిలే! నీవు వేశ్యావృత్తి అవలంబించనే లేదట! ఎంత నాటకం ఆడావు!" అని ఎంతో ఆప్యాయంగా ఆమెను కౌగలించుకోబోయాడు ఆమె రుసరుసలాడుతూ అతనికి దొరక్కుండా దూరంగా తొలగిపోయింది

"విజ్జిక చెప్పినట్టే నాళ్ళనించీ మీ సంగతి కనుక్కోవడంకోసమే ఈ నాటకం అంతా ఆడాను కాని ఇక ఈ క్షణంనించీ నిజంగా వేశ్యావృత్తే అవలంబించాలని నిశ్చయించాను తెలిసిందా?"

"ఇదేమిటీ ప్రళయం! ఎందుచేత?"

"నేను వారుణి ననుకొని మీరు నా మీద కనబరచిన ఆప్యాయత తలచుకుంటే నాకీ గృహిణీధర్మం కంటే వేశ్యావృత్తే మంచిదనిపించింది! అందుచేత! తెలిసిందా!"

ఆమె మాటల ధోరణి పరిశీలిస్తే ఇందుశర్మ కామె అన్నంతపనీ చేసితీరుతుందని భయం వేసింది ఆ విషయం తలచుకోగానే అతని గుండె దడదడలాడింది ఇందుశర్మ భార్య, కార్తికేయశర్మామాత్యుని కోడలు ఇకనించీ వారకాంతగా మారిపోతుంది ఆ సంగతి నలుగురికీ తెలిస్తే అతడిక తల ఎత్తుకు తిరగగలడా? అంతానా ఎందుకు? అసలిక జీవించగలడా? వెంటనే విషం తాగి ప్రాణపరిత్యాగం చెయ్యవలసిందే! అందుచేత ఎల్లాగైనా బతిమాలి బామాలి ఆమెను నెమ్మదిగా ఇంటికి తీసుకుపోవాలని అనుకొన్నాడు పైగా ఆమెమీది అప్యాయత కూడా తోడైంది చేతులు పట్టుకొని ఎంతో దీనంగా బతిమాలుకొన్నాడు ఐనా ఆమె తనపట్టు విడవలేదు. ఇక గత్యంతరం లేక కాళ్ళమీదపడ్డాడు

"బాలచంద్రికా! నావల్ల పెద్దఅపరాధమే జరిగిపోయింది నేనిక ఎప్పుడూ ఇలాంటి అప్రచ్ఛపు పనులు చెయ్యను నన్ను మన్నించు" అని అతి దీనంగా ఆమె ముఖంవైపు చూచాడు

"ఇప్పుడిలాగే కాళ్ళావేళ్ళాపడి బతిమాలుకుంటారు! తీరా ఇంటిలో అడుగుపెట్టగానే నేనెందుకు కొరగాని వట్టి భార్యనైపోరుకుంటాను నే నేదేనా ముచ్చటపడి మాట్లాడితే మీ హూంకరింపులు, చిరాకు బయలుదేరతాయి అదేమండీ అంటే పోతే పుట్టింటికిపో! అని బెదిరిస్తారు! నాకీ ఈ పడింపులన్నీ పడవలసిన అవసరమేముంది నన్నింక బలవంతపెట్టకండి! వెళ్ళండి!" అని కసిరి కొట్టి అతని పట్టువిడిపించుకొని ఇంకా కొంచెం దూరంగా తొలగిపోయింది ఇందుశర్మ లేచి నిలబడి మళ్ళీ బతిమాలుకొన్నాడు

"కాళ్ళావేళ్ళా పడి బతిమాలుకొన్నా ఇలాగ ఈ పడించి వెయ్యడం నీకు ధర్మమేనా? ఇంక నావల్ల ఏదైనా కొంచెం తప్పు జరిగిందంటే వెంటనే నీ ఇష్టం వచ్చిన శిక్ష విధించు భరిస్తాను సరిగదా!" అని మళ్ళీ ఎంతో దీనంగా ఆమెవైపు చూచాడు

"శిక్ష వెయ్యడానికి నేనెవర్ని? ఏమన్నా కొంచెం తేడావస్తే ఇక నా ఇష్టం వచ్చినట్టుంటాను సరేనా?"

"సరే!"

"అయితే పదండి వస్తాను" అని బాలచంద్రిక లేచి వెళ్ళబోయింది అంతలోనే ఆమెకేదో స్ఫురించింది

"మీరు నన్నేదో మాయచేస్తున్నారు. నేను మీతో రాను గాక రాను!"

అని అక్కడే చతికిలబడిపోయింది

"పోనీలే! అసలు నేనిక ఇంటికి వెళ్ళను! ఇక రాత్రింబగళ్ళిక్కడే తిష్ఠవేసాను. ఇదీ బాగానే ఉంది ఇదీ నాయిల్లేగా!" అని ఇందుశర్మ ఆమెకేసి చూచి కొంచెం కొంటెగా నవ్వాడు బాలచంద్రికకు వెంటనే ఆ మాటకు సమాధానం తోచలేదు ఒక్క క్షణం ఆలోచించి సూటిగా ఎత్తిపొడిచింది

"అవును! ఊళ్ళో ఉన్న ఇళ్ళన్నీ మీ ఇళ్ళే! అందుకనే కొడరం ఇంతదాకా వచ్చింది"

అని అలవోకగా నవ్వింది ఇందుశర్మ తన తప్పిదం గ్రహించుకొన్నాడు

"అపరాధం! అపరాధం! ఇది నాయిల్లు కాదు నీయిల్లే! దిక్కులేనివాడికి ఒక్క రాత్రికి కొంచెం ఆశ్రయం ఇప్పించు" అని మళ్లీ ఆమె కాళ్లు పట్టుకోబోయాడు

"చాల్లెండి! అయినదానికీ కానిదానికీ ఇదొక కొత్త విద్య నేర్చుకున్నారు!" అని ఆమె అతనికందకుండా తప్పించుకుపోయింది

ఇందుశర్మ ఆ మరునాడు తెల్లవారకుండానే లేచి బాలచంద్రికను, విజ్జికను వెంటబెట్టుకుని చాటుమాటుగా తన భవంతికి వెళ్లిపోయాడు

—సమాప్తం

# జూదాల పండుగ

అది పదునెనిమిదవ శతాబ్దపు మొదటి రోజులు. ఒరిస్సా కొండల నడుమనున్న ఆ గ్రామం చుట్టూ దట్టంగా అడవులున్నాయి. ఎర్రటి పువ్వులతో ఎల్లప్పుడూ ఆ గ్రామం చుట్టుపక్కలు అందంగా కనబడుతుండేది. తిరిగి తిరిగి అలసిపోయి ప్రక్కల ఉన్న కొండలమీద విశ్రాంతి తీసుకొనే దిగిన మేఘాలతో ఆ పరిసర ప్రాంతం కన్నుల కింపుగా కనబడుతుండేది. ఆ గ్రామంలో నివసించే వారందరూ వ్యవసాయదారులు. భూమిని దున్ని పంటలు పండించే కర్షకులు. వారికి డబ్బుతో పని అంతలేదు. కావలసిన తిండి, బట్ట, ఇల్లు వేయటానికి పనికివచ్చే పరికరాలు, దేవాలయాలు, మోసాలకు వారిదగ్గర ఏమీ లేదు. నిత్యజీవితానికి కావలసినవి అంటిపెట్టుకుని ఉంటాయి.

పట్టణాలలో ఉన్నవారికి డబ్బు కావాలి. డబ్బు లేకపోతే వారు జీవితం గడుపలేరు. కాని పల్లెప్రజలు డబ్బుతో నిమిత్తం లేకుండా నెలలు ఆనందంగా గడుపగలరు.

రామచంద్రపురంలో సుబ్రోకు ఉన్నదల్లా ఒక ఎడ్లజత, మూడు ఎకరాల భూమి, నాగలి, విల్లమ్ములు, కట్టెలుకొట్టుకునే గొడ్డలి, భార్య "నిన్ని," చిన్నగుడిసె, ఇవే అతని ఆస్తి.

అతని స్నేహితుడు గంగాధరుడు కూడా సుబ్రో ఆస్తికన్న ఎక్కువలేదు. వారిద్దరూ కష్టపడి పనిచేసి తమ జీవితాలను సంతోషంగా వెళ్ళబుచ్చుతుండేవారు.

ఆ కాలంలో ఆ పరిసర గ్రామాలలో ప్రతి ఏటా "జూదాలపండుగ" అని ఒక పండుగ జరుపుకునేవారు. పంటలు పండించి, గింజలు ఇంటికి చేరవేసి సంతోషంగా ఉన్న సమయంలో ఆ పండుగ జరుపుకునేవారు. ఆ పండుగరోజున పిన్నా పెద్దా అందరు జూదమాడి ఆనందంగా కాలం వెళ్ళబుచ్చేవారు. సాయంకాలం కాగానే స్త్రీ పురుషులందరూ కలసి నృత్యం చేసేవారు. డప్పులు కొడుతూ శ్రావ్యమైన కంఠాలతో, గొంతెత్తి పాటలుపాడుతూ, ఆనందం వెలిబుచ్చేవారు.

పండుగ దగ్గర పడింది. సుబ్రో తనకు పండిన పంటలో కొంత భాగం ఇచ్చి నిన్నికి పూసలపేర్లు, బట్టలు మొదలైనవి బజారులో తీసుకున్నాడు. నిన్ని ఇంటిని శుభ్రంచేసి, మట్టితో నేల అలికి నేలమీద, గోడలమీద రంగు రంగుల ముగ్గులు పెట్టింది.

పండుగ నాటిరాత్రి ఆనందంగా గడపటానికని, కొంతకాలంగా వెదురు గంపలో పెట్టి నిన్ని తెచ్చిపెంచుతున్న కోళ్ళలో ఒక కోడిపుంజును ఆనాటిరాత్రి విందుకు బలివ్వటానికి నిశ్చయించుకున్నారు.

పండుగ ముందురోజు ఆ గ్రామమంతా వింత వింత ముగ్గులతోను, పచ్చని తోరణాలుగల పందిళ్ళతోను కలకలలాడింది.

## కొండపల్లి సాంబమూర్తి

పండుగనాడు ప్రాతఃకాలాన్నే లేచి శుభ్రంగా స్నానంచేసి గంగాధర్ కొరకు కాసుకూర్చున్నాడు సుబ్రో. నిన్ని ప్రక్క ఇల్లాలితో కాలక్షేపం చేయటానికి వెళ్ళింది.

కొంతసేపటికి గంగాధర్ హుషారుగా వచ్చాడు.

"ఏం గంగాధర్! ఇంత ఆలస్యంగా వచ్చావేం? ఈవేళ పండుగని మర్చిపోయావా?" ప్రశ్నించాడు సుబ్రో.

"లేదు సుబ్రో! లేవటం కొంచెం ఆలస్యమయింది" అని కూర్చున్నాడు గంగాధర్.

"పాచికలు తెమ్మన్నావా?"

"తీసుకొనిరా సుబ్రో! కాలక్షేపానికైనా కొంతసేపు ఆడాలిగా?" అన్నాడు గంగాధర్.

సుబ్రో పాచికలు తెచ్చాడు. ఆట ఉపక్రమించారిద్దరున్నూ.

"పందెం వేస్తావా?" అనడిగాడు సుబ్రో.

"కాలక్షేపం కొరకు ఆడుకునేదానికి పందెం ఎందుకు సుబ్రో" అన్నాడు గంగాధర్.

"కాలక్షేపంకొరకు ఆడుకున్నా పందెం లేకపోతే ఆటమీద శ్రద్ధపుట్టదు గంగాధర్! ఏమాత్రమైన పందెం ఉంటే ఆట హుషారుగా సాగుతుంది" అన్నాడు సుబ్రో.

"నీ ఇష్టమే కానీ సుబ్రో" అన్నాడు గంగాధర్.

"నేను నా గొడ్డలి పందెంగా పెడుతున్నాను గంగాధర్"

"సరే! నేను నా గొడ్డలి పందెంగా పెడుతున్నాను"

ఆట ప్రారంభమైంది. గంగాధర్ గెలిచాడు. సుబ్రో చిన్నబుచ్చుకున్నాడు.

"ఈసారి నా నాగలి పందెంగా పెడుతున్నాను"

సుబ్రో ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు గంగాధర్.

"ఎందుకులే సుబ్రో నీ గొడ్డలి నీవే ఉంచుకో" అన్నాడు.

"అబ్బే! నా గొడ్డలి నీవు గెల్చుకున్నావు అది నీదే, ఆట సాగనీ" గద్దించాడు సుబ్రో.

రెండో ఆటకూడా సుబ్రో ఓడిపోయాడు. ఈసారి ఓడిపోవటంతో సుబ్రోకు రోషం వచ్చింది.

"నా ఎడ్లను పందెం పెడుతున్నా" నన్నాడు.

"నేను నీవద్ద గెలిచిన నాగలి గొడ్డలి పందెం పెడుతున్నా" నన్నాడు గంగాధర్.

ఈసారి కూడ సుబ్రో ఓడిపోయాడు.

"ఆటమాని నీ వస్తువులు నీవే తీసుకో" మని గంగాధర్ చెప్పాడు, కాని సుబ్రో వినిపించుకోలేదు.

వేసేదిలేక సుబ్రో పొలాన్ని పందెంగా అంగీకరించాడు. గంగాధర్ పొలంపోయింది. తర్వాత ఇల్లుకూడా ఓడిపోయాడు సుబ్రో.

(30 వ పేజీ చూడండి)



# అట్లతద్దె - ఉయ్యాల

కనుపర్తి వరలక్ష్మమ్మ

అట్లతద్దిరాగ అక్కకూ నాకు
తలయంటినీళ్ళోసి గోరింటపెట్టి
వేగుబోకకుముందె వేగమేలేచి
అన్ననూ తమ్ముణ్ణి అందర్ని లేపి,
వెండికంచాల్పెట్టి విడిపిటలేసి
* ఉట్టిక్రిందుగ నాకు పెట్టి కంచంబు
మా అమ్మ పెట్టింగి నాకు అన్నంబు
వేడ్వేడి అన్నంబు వేపుడుకూర
కమ్మని పప్పుళ్ళు గమగమానెయ్యి
మీగడ పెరుగేసి మాగాయ వేసి
మా అమ్మ పెట్టిందిమాకుఅన్నంబు

* * *

పెరటిలో వున్నట్టి పెద్ద వుయ్యాల
మామయ్యగారింట మే మూగబోతే
మంచిమాటలుచెప్పి మామ కూతుళ్లు
అక్కనూ ఉయ్యాల కెక్కించితాము
పెద్దపెద్దగ ఊపి వద్దన్న కొలది
చిరతల్తొ కుదిలించి చీకాకుపెట్టి
* మగనిపేరును చెప్పమని వూప [గాను
ఉక్కిరిబిక్కిరై అక్కయ్య చెప్పె
బావగారిపేరు బహు సిగ్గుపడుచు.

* * *

అక్కయ్య దిగగానె ఎక్కించి నన్ను
ఉయ్యాల ఊపిరే ఊ పావకుండ
ఆ వూపులకు నేను ఆగగాలేక
అక్క చెప్పినపేరు నే చెప్పగానె
గొల్లున్న అందరూ గోలగా నవ్వి
ఎగతాళి చేశారు ఎందుకే అమ్మా?

* * *

---

* పెళ్ళిగానిపిల్లలకు ఉట్టిక్రింద భోజనం పెట్టడం ఆచారం

* పెళ్లియిన పిల్లలను మగని పేరు చెప్ప వరకు ఉయ్యాల ఆపకుండా ఊపుతారు.



కన్నె ముత్తం

# అట్లతద్దోయ్

ఇంకా బారెడు పొద్దుండగానే గోరింటాకు పెట్టేసుకున్నారు చిన్న తలులూ చిట్టి తల్లులూను చప్పచప్పన పెట్టేసుకుంటే, చప్పున వేళ్లు పండిపోతాయి అప్పుడేమో, చేతులు కడిగేసుకుని, పండిన వేళ్లు, అరచేతి సిరీ అమ్మకీ నాన్నకీ అవ్వకీ తాతకీ చూపించేసి, చప్పున నిద్రపోతే, మళ్లీ తెల్లారగట్టే చప్పునలేచి ఆటలకి బయల్దేరచ్చు గోరింటాకు పెట్టుకున్న దగ్గర్నించి,తీసేసేవరకూ అసలేం తోచదు పండిందా లేదా? ఎంత పండింది? ఎలా ఉంది? అని మనసు తహతహ లాడుతుంది మనసు తహతహ లాడింపని మనం తొందరపడి గోరింటాకు తీసేస్తే వేళ్లు లేతగానే పండుతాయి తీరా ఓసారి తీసేశాక మళ్లా వేసుకున్నా మరింక పండను సునుండీ! దేనికేనా సరే తొందరకూడ దన్నారందుకే తొందర పడితే, మొగలీ పువ్వంటి మొగుణ్ణీమ్మంటే, ముసీలి మొగుడే దొరుకుతాడు...

అనగానగా అనగా వినగా వినగా,కథ
ఒక ఊళ్లో ఐదుగురు నేస్తాలున్నారు
ఒక పిల్లేమో రాచవారి చిన్నది, ఇం
అమ్మాయి బ్రాహ్మణ పడుచు, అలా
శ్రేష్ఠి కుమార్తె, సేనాపతి కూతురు,
సాలెవారమ్మాయిని అట్లతద్దె వచ్చింది
రోజు పొద్దున్నే లేచి, ఉట్టికింది వ
ఎందకొక్కాతి వేసి, ఎకండో, ఆటకి రం
అని ఒకళ్ళ నొకళ్లు పిల్చుకుని తోట
వెన్నెల కుప్పలూ, దాగుడు మూత
ఆడుకున్నారు పుచ్చపువ్వంటి వెన్నె
అలా అలా కరిగిపోయి తెల్లగా తెల్లారిం

'అమ్మకడుపు చల్లగా అత్త...ను
చల్లగా' తలంట్లు పోసుకుని, చక్క
కొత్తబట్టలు కట్టుకుని, ఆగారం నగలు
కున్నారు ఐదుగురూ ముద్ద బంతిపూ
రథాలలా నిండుగా, తల్లి దండ్రుల కంట
పండుగ్గా ముస్తాబై తాంబూలాలు వేసుకు
నాలిక లెలా పండాయో, చూసుకు ము
పోతూ మురిపించు



ుదుల నోము

# ఆరట్లోయ్!!

ఊయ్యాలలో ఊరేగబోయారు. తిరిగి తిరిగి ఊరేగి రెండుఝాములవేళకి అలసి సొలసి ఇలుచేరారు అమ్మా ఆకలేఅంది రాచవారి చిన్నది కూడ దమ్మడూ అంది వాళ్ళమ్మ సందెవేళదాకా ఆగి, చంద మామమాసి మరీ బువ్వతిన్నాలమ్మ అంది లాలనగా సందెవాలినా, చందమామ ఎంతకీ రావటంలేదు

రాచవారి చిన్నది ఆకలితో నకనకలాడు తూంది వాళ్ళన్న మనసు వెన్నలై కరిగిపోయింది

ఏడుమల్లెపూల ఎత్తున్న, సుకుమారి ఈ రాకుమారి అలా కష్టపడడం చూడలేకపోయాడు

అపళంగా ఆరిగ్గడ్డిమూరాన మంటవేసి, ఆ ఎరుపుచాయలు అద్దంలోపటి, 'చెల్లెమ్మా చూడిదిగో చందమామ, ఇంక బువ్వతినమ్మ' అన్నాడు ఆ అమ్మాయి తినేసింది

అంతే ఇంకేముంది. తన నేస్తాలకి తోటి వాళ్ళందరికీ మొగలిపువ్వంటి మొగుళ్లు దొరికితే, ఈ రాచవారి పడుచుకిమాత్రం పడుచుపిల్లాడు దొరకాడుకాదు ముసలి మొగుడొచ్చాడు

ఆ బాల ముత్తైదుమనసు అధుమటించిపోయింది 'నేనేపాపం చేస్తినమ్మా అని వాపోయింది

ఆనాడు పార్వతీ పరమేశ్వరులు ఆ కన్నెకు కలలో దర్శనమిచ్చారు

'ఓ బాలా నీ వానాడు అట్లతదియ నోము నాడు, మీ అన్నమాటలు నమ్మి వ్రతం పూర్తి కాకుండా అన్నం తిన్నావు ఆ ఉల్లంఘన ఫలితమే ఇది ఈసారినుండి పదేళ్ళు భక్తి శ్రద్ధలతో ఆ నోమునోచుకో" అని చెప్పి అక్షతలిచ్చారు.

ఆ పడుచు, కలతెలిసి, లేచి చూచేవరకు ఆమె చేత అక్షతలు నిలచేఉన్నాయి ఇంకేముంది! ఆ అక్షతలను భర్తశిరాన ధరించేవరకూ పదహారేళ్ళ బాలాకుమారుడై నవమోహనాంగుడై ఎదుటనిలచాడు!

(48-వ పేజీ చూడండి)

(26 వ పేజీ తరువాయి)

"చెబుతేవిన్నావు కావు సుక్రో! నీ పంతం నీదే కాని నా మాట వినిపించుకోవు కదా!" అన్నాడు గంగాధర్

సుక్రో మౌనంగా తలదించుకున్నాడు

"అయిందేదో అయిపోయింది సుక్రో, జరిగినదాన్ని మర్చిపోయి నీ ఆస్తిని నువ్వు తీసుకో అసలు మనం పందెం పెటలేదనుకో"

"లాభం లేదు గంగాధర్, నీవు గెలిచిన దాన్ని నా దనుకుని ఆత్మవంచన చేసుకోలేను అవన్నీ నీవే మళ్ళీ నేను గెలుచుకుంటే నే వాటిని తీసుకుంటాను"

"గెలుచుకోవాలంటే పందెం పెట్టాలి, పందెం వేయటానికి నిన్ను పూ సల పేర్లు తప్పించి, ఇంకేమీ నీవద్ద లేవు ఆ పూసల పేరు ఓడిపోయిన నీ ఆస్తికి సరితూగగలవా సుక్రో" అన్నాడు గంగాధర్

నిన్ని విషయం జ్ఞాపకం రాగానే సుక్రోకి తన ఆస్తిని గెల్చుకోగలనన్న ఆశ మొలకెత్తింది

"నా ఆస్తికి పందెంగా నిన్నిని ఒడ్డుతున్నాను గంగాధర్! ఆట ప్రారంభించు" అన్నాడు సుక్రో గంభీరంగా

సుక్రో మాట విని గంగాధర్ ఉలిక్కి పడ్డాడు

"ఏమిటన్నావ్ నిన్నినా?" అన్నాడు ఆశ్చర్యంతో

"అవును నిన్నినే"

"నీకేమైనా మతి చలించలేదు కదా?"

"లేదు గంగాధర్, నా ఆస్తి రాబట్టుకోవాలంటే ఇంకో మార్గం లేదు ఈ ఆట గెలిస్తే నా ఆస్తి నాకు దక్కుతుంది అప్పుడు నాకు ఆధర్మంగా ప్రవర్తించానని మాటరాదు లేకపోతే ఓడిపోయిన ఆస్తి అన్యాయంగా తిరిగి తీసుకున్నానని అపకీర్తి వస్తుంది ఆలోచించక ఆట ప్రారంభించు"

గంగాధర్ నిముషంసేపు సందిగ్ధంలో పడిపోయాడు 'నిన్ని' నిన్ని సౌందర్యం ఒక్కసారి అతని కన్నులముందు మెరసింది నిన్ని సౌందర్యవతి ఆమె సౌందర్యం ముందు ఆ గ్రామస్త్రీల సౌందర్యం ఎందుకూ పనికిరాదని గంగాధర్‌కు తెలుసు

మౌనంగా ఆట ప్రారంభించాడు ఈసారి కూడా సుక్రో ఓడిపోయాడు కాని సుక్రో చలించలేదు అతని గంభీరవదనం చూసి గంగాధర్ కొద్దిగా జడిశాడు

"నా సర్వస్వం నీదే గంగాధర్" అన్నాడు సుక్రో అతనికంఠం విని గంగాధర్ ఉలిక్కిపడ్డాడు

'నీ ఆస్తి, నీ భార్యని నీవే తీసుకో' అని ఈసారి గంగాధర్ అనలేక పోయాడు దీనికి కారణం నిన్ని అపూర్వ సౌందర్యవతి గంగాధర్‌కి సుక్రో ఆస్తిపై ఆసక్తిలేదు. కాని సుక్రోభార్య నిన్నిని తను గెల్చుకోవటంతో అతను 'నీభార్యను నీవే తీసుకో' అని అనలేక పోయాడు

గంగాధర్ నోటినుండి "నీభార్యను నీవే తీసుకో" అని మాటవస్తే, ఆస్తి అతనికిచ్చి భార్యతో ఇంకో గ్రామానికి వెళిపోవాలనుకున్నాడు సుక్రో కాని గంగాధర్ నోటినుండి ఆ మాట వెలువడకపోవటంతో సుక్రో సమస్తం త్యజించటానికి సంసిద్ధుడయాడు

సుమారు పావుగంట వరకు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

కొంతసేపటికి నిన్ని వచ్చింది భర్త గంభీరవదనం చూసి నిన్ని నిర్ఘాంతపోయింది

"పండుగపూట మిత్రులిద్దరూ మౌనంగా కూర్చున్నారేం?" అంది లేని చిరునవ్వు తెచ్చుకుంటూ

గంగాధర్ ఏదో చెప్పాలనుకున్నాడు కాని నోరు విప్పలేకపోయాడు కడకు సుక్రో మెల్లగా పెదిమలు కదిపాడు

"నా సర్వస్వం, అంటే నీతోసహా గంగాధర్‌కి ఓడిపోయాను నిన్ని" అన్నాడు శుష్కస్వరంతో

నిన్ని నిలుచున్న పాళంగా కొయ్యబారిపోయింది న్యాయానికీ, నీతికీ కట్టుబడి ఉన్న తనభర్తను చూసి స్తంభించిపోయింది కట్టుకున్న భార్యను జూదంలో ఓడిపోయాడా? తనభార్యను పందెం పెట్టాడా? ఆడదంటే ఆటబొమ్మ అనుకున్నాడా? ఎంత సాహసం కాని అతను తన భార్యను ఓడిపోయాడు న్యాయంగా తను గంగాధర్‌తో వెళ్ళక తప్పదు

"నిన్ని నేను న్యాయానికి కట్టుబడి ఉన్నాను నీవు గంగాధర్‌తో వెళ్ళు నీవేమైనా అడ్డు చెప్పేవంటే నా ఆత్మను ఖూనీ చేసినదానవౌతావు ఇందులో నీ తప్పేమీ లేదు అంతా భగవంతుని లీల" అంటూ కన్నీరు తుడుచుకున్నాడు సుక్రో

"మీ హృదయం నాకు తెలుసు మీ నిజాయితీకి నేను భంగం కలిగించను" అని మెల్లగా లోనికివెళ్ళి కొన్ని బట్టలు మూట కట్టుకుని వచ్చింది

"పదండి మీతో మీయింటికి వస్తాను," అంది గంగాధర్ నుద్దేశించి

నిన్ని వెంటనే తనతో బయలుదేరుతుందని గంగాధర్ నమ్మలేకపోయాడు నిన్ని వస్తే సుక్రోని చీవాట్లు పెడుతుందనుకున్నాడు గాని తనవెంట బయలుదేరుతుందని కలలోకూడా నమ్మలేక పోయాడు గంగాధర్ కాని ఇప్పుడు నిన్ని తనతో బయలుదేరతోంది అంటే నిన్ని తనను గూఢంగా ప్రేమిస్తోందన్న మాట

గంగాధర్ మాటాడకుండా బైటకు నడచాడు నిన్ని అతన్ననుసరించింది

వారిద్దరూ బైటకువెళ్ళగానే భుజముమీద నున్న తుండుగుడ్డతో కన్నీరు దుడుచుని తలుపులు మూసుకున్నాడు సుక్రో

*..............*..............*

**వింతవిహారిన మతిమరుపు**

ప్రొఫెసర్‌ల జాతికి మతిమరుపు అనేది ఎందుకు సంప్రాప్తమైంది? అనేవిషయంపై ఒక ప్రొఫెసరుగారు ఏడాది పరిశోధన జరిపారు జవాబు కనుక్కున్నట్టున్నారు కూడా ఏం లాభం? అంతలో మర్చిపోయారు.

*..............*..............*

## 2

తనభర్తవెంట వస్తున్న నిన్నిని చూసి "మైనా" మొదట తనకళ్ళను తానే విశ్వసించలేకపోయింది నిన్ని తనభర్తవెంట మూటపట్టుకొని రావటంతో ఉద్రేకమేమీ కాక ఆమె కెంత ఆలోచించినా బోధపడలేదు

వాళ్ళిద్దరూ దగ్గరకు రాగానే "బాగున్నావా నిన్నీ" అని పలకరించింది

నిన్ని జవాబు చెప్పకుండా మౌనం వహించింది

"ఇలా వచ్చావేం నిన్నీ?" అంది మైనా మళ్ళీ

"పండుగకదా అని, అన్నయ్య తీసుకు వస్తానంటే వచ్చాను నా అన్న ఇంటికి, అందులో పండుగపూట రావటంలో తప్పేముందమ్మా" అంది నిన్ని

నిన్నిమాటలు గంగాధర్ హృదయానికి సూటిగా తగిలాయి తనూహించిందేమిటి? ఇప్పుడు నిన్ని అంటున్నదేమిటి? కథ ఇలా అంతమౌతుందని తాను మొదట ఊహించలేదే! నిన్ని సౌందర్యాన్ని చూసి సోదరునివంటి మిత్రునికి ద్రోహం తలపెట్టేను వచ్చేటప్పుడు 'నిన్నిని నీవే ఉంచుకో సుక్రో' అని మాట మాత్రమైనా చెప్పకుండా నిన్నిని వెంటబెట్టుకుని వచ్చేశాడు

తనని సోదరునివలె చూసుకుంటున్న నిన్నిని, ఆమె సౌందర్యంచూసి తనింకోలా తలపోశాడు ఎంత మిత్రద్రోహం!

సుక్రో తనయందు చూపించే ఆదరం, ప్రేమ ఒక్కసారి కళ్ళముందు మెదిలాయి తన మిత్రద్రోహానికి ప్రాయశ్చిత్తం ఈ లోకంలో ఉండదనుకున్నాడు గంగాధర్

(56 వ పేజీ చూడండి)

# విడని బంధం

**మందరపు పద్మ, లలిత**

శారదమ్మా, శేఖర్ ఊరినుంచి వచ్చిన మర్నాడు "ఏమే! అమ్మాయి పెళ్ళి విషయం ఏమంటావ్? మా చెల్లెలు ఒకటే తొందర పెడుతున్నది శేఖర్ కిచ్చి చేసుకుంటావా అని" అంటూ జానకిరామయ్య వాళ్ళ రాకలోని అంతర్యాన్ని కాంతమ్మకు స్పష్టంగా విప్పి చెప్పాడు.

కాంతమ్మ అదిరిపడి చూసింది.

"బాగుంది వరస! నిక్షేపంలాంటి పిల్లను ఆ దరిద్రపు మొఖానికి కట్టబెట్టటానికి ఎందుకో రాలా ఆడించండి? చేసేది బత్తెరు ఉద్యోగం, ఆస్తిపాస్తులు మొదలే లేవు. ఏం చూసి ఇవ్వాలట మీ మొహం" అంది కాంతమ్మ నిర్ఘాంతపోతూ.

"ఇప్పుడే ముందే—ఇవ్వాళ ఉంటుంది రేపు పోతుంది ఉద్యోగం మాటఅంటావా—ఎల్లకాలం ఇందులోనే వుండిపోతాడా యేం? నేను మాత్రం—"

మధ్యలోనే జానకిరామయ్య మాట ఖండిస్తూ "ఇహ చాలించండి మీ వేదాంతం" అని చిరాకుపడింది కాంతమ్మ.

"ఈ సంబంధానికేమి? పిల్లాడు బుద్ధిమంతుడు, చదువుకున్నాడు పైగా మేనరికం ఏకట్నమూ, ఖర్చూ లేకుండా అమ్మాయి భారం తీరిపోతుంది" అన్నాడు జానకిరామయ్య దూరాలోచన చేస్తూ.

కాంతమ్మ "హవ్వ" అని నోరు నొక్కుకుని "కట్నం ఇవ్వక్కర్లేదన్న సంబరమే కాని అమ్మాయికి మంచి సంబంధం చేద్దామన్న తలపే లేదు కదా మీకు. చదివాడు లెండి మహా గొప్ప చదువు! తప్పి, తప్పి ఆ డిగ్రీ కాస్తా వచ్చేసరికి తలమునకలైనంత పనయ్యింది. సరోజ చూస్తే అద్భుతమైన తెలివితేటలతో చరచరా పైకి వచ్చేస్తున్నది. దాని అందచందాలు, తెలివితేటలు చూసి ఏ కోటీశ్వరుడైనా కళ్ళకద్దుకుని చేసుకుంటాడు. కొంత కట్నం ఇస్తే ఇస్తాం మరి—ఆడపిల్లన్నాక తప్పుతుందా? ఇంతకూ ఆ మొద్దురాచిప్పను అది మాత్రం చేసుకుంటానంటుందేమిటి?" అని ముఖం చిట్లించుకుని జానకిరామయ్య "గురాలోచనకు" కోపగించుకుంటూ చురచురా చూసింది కాంతమ్మ.

అప్పుడే అవతల గదిలోకి వెళ్ళబోతున్న సరోజను చూసి జానకిరామయ్య "రామ్మా సరోజా" అంటూ కేకేశారు.

"నీ పెళ్ళి గురించే అనుకుంటున్నాం" అన్నాడు జానకిరామయ్య సరోజనుద్దేశించి. జరిగిన సంభాషణంతా సరోజ చెవిని పడక పోలేదు.

"మీకా శ్రమ అక్కర్లేదు! చదువు పూర్తి కాందే నేను పెళ్ళిచేసుకోను" అని సాధ్యమైనంత కటువుగా అనేసి తన గదిలోకి వెళ్ళిపోతున్న దల్లా వరండాలో తచ్చాడుతున్న శేఖర్‌ను చూసి గతుక్కుమంది. విసురుగా తన గదిలోకి వచ్చి పడ్డది.

రోషాభిమానాలతో సరోజ హృదయం దహించుకుపోతున్నది. తండ్రి అన్న మాటలు తలచుకుంటుంటే గంగవెర్రులెత్తుతోంది తనకు. "తానూ ఒక మనిషేనా? తిపుడూ ఒక రొట్టేనా" అన్నట్టు తండ్రి దృష్టిలో ఇదీ ఒక "సంబంధమే"—ఇది తప్ప గతిలేనట్టు ఎంత హీనంగా మాట్లాడారు?

తనకు శేఖర్ తగినవాడు కాదని నాన్నకెందుకు తోచదు? పైగా ఏదో మెట్ట వేదాంతం మాట్లాడబోతాడు! అమ్మకున్నంత జ్ఞానం కూడా నాన్నకెందుకు లేకపోవాలి? నాన్నకు కట్నం లేకపోతే చాలు అమ్మకు డబ్బుంటే చాలు అంతేగాని "ఆఫీసర్" కూతురు అతిసామాన్యుడైన "గుమాస్తా"ను ఎలా పెళ్ళాడుతుంది?—అన్న స్వల్ప విషయం ఎవరికీ తట్టనే తట్టదు, "హోదా" సంగతి ఎవరికీ పట్టనే పట్టదు.

ఉక్రోషం పట్టలేక సరోజకు కళ్ళ నీళ్ళ పర్యంతమయ్యింది.

"సరోజా! మన పెళ్ళికి నిజంగా నీ చదువే అడ్డా?"

సరోజ ఉలిక్కిపడి చూసింది. గుమ్మం అవతల సంశయిస్తూ నించున్నాడు శేఖర్.

తన చదువు పూర్తయ్యేంతవరకూ ఆగటానికి శేఖర్ కెలాంటి అభ్యంతరమూ వుండదని సరోజకు తెలియనే తెలుసు.

"మన పెళ్ళి అనకు నా పెళ్ళికి—!" అంది సరోజ చురుకుగా. శేఖర్ గతుక్కుమన్నాడు.

"అదేం సరోజా! అలా అంటావు?"

"మరేం అనమంటావ్? ఇంతోటి ఉద్యోగస్తుడు చేసుకోవటమే అపురూపం అనుకుని ఎగిరి గంతేస్తాననుకున్నావా? నువ్వు చేసుకుంటేనే గాని గతి లేదని నీ కాళ్ళ మీద పడతాననుకున్నావా? మా నాన్నే ముందుగా... ఎవరి అంతస్తులు వాళ్ళు గుర్తుంచుకోవటం మంచిది! "ఆఫీసర్" కూతురిని—చదువు, తెలివి, అందచందాలు అన్నీ వున్నాయి. నా అంతస్తుకు తగ్గట్టు ఏ పెద్ద ఉద్యోగినో చేసుకుంటాను గాని—నీలాంటి దిక్కుమాలిన గుమాస్తాను కట్టుకుంటానని అనుకోవటానికి నీకు ఎలా నోరు వచ్చింది? ఛీ! ఛీ!" అంది పొంగి పొరలుతున్న రోషంతో.

దెబ్బతిన్న లేడిలా సరోజ కేసి ఓక్షణం చూసి తలవంచుకున్నాడు శేఖర్. లజ్జాభిమానాలతో శేఖర్ ముఖం ఎర్రబడిపోయింది. కాంపౌండ్ లోకి వెనుదిరిగి, గుమ్మాని ఆనుకుని కొద్దిసేపు నిర్వ్యాపారంగా నించుండిపోయాడు. కాస్సేపటికి తేరుకుని చరచరా వెళ్ళిపోయాడు శేఖర్.

అవమానభారంతో వెళ్ళిపోతున్న శేఖర్‌ను చూసేసరికి సరోజకు తండ్రికూడా ఒకప్పుడు గుమాస్తాయే నన్న సంగతి చప్పున జ్ఞాపకం వచ్చి ఉలిక్కిపడ్డది. ఎవరో చెంప మీద ఛెళ్ళున చరచినట్టయ్యింది.

'ఆఫీసర్' కూతురు తను. తనకు తగ్గట్టు ఏ 'ఆఫీసర్'నో చేసుకుంటుంది. కార్లెక్కి తిరుగుతుంది—దర్జాగా, గౌరవంగా బ్రతుకుతుంది! అంతేగాని ఒక దిక్కుమాలిన గుమాస్తాను—ఛీ! ఛీ! ఎంత అవమానం!

కాంపౌండ్ లోకి వెనుదిరిగి శేఖర్ నిర్వ్యాపారంగా నిలుచున్నప్పటి దృశ్యం జ్ఞాపకం వచ్చి సరోజ మనస్సు కలుక్కుమంది.

రోషం, అభిమానం, అవమానం అన్నీ సరోజను ఒకేసారి ముట్టడి వేశాయి. మధ్యమధ్య తను శేఖర్ మీద ప్రయోగించిన కఠినోక్తులు, శేఖర్ గుమ్మాని ఆనుకొని అచేతనంగా నించుండిపోవటం గుర్తొచ్చి మనస్సు మరింత కలతబారుతూ వచ్చింది.

వ్యాకులమైన చిత్తాన్ని అదుపులో

# ★ విడని బంధం ★

పెట్టుకోలేక సరోజ చాలాసేపు మంచం మీద పొర్లి, పొర్లి ఏడ్చింది

*  *  *

శేఖర్ పెళ్ళి ఆ వేసవిలోనే తిరుపతి కొండమీద సలక్షణంగా జరిగింది మొదట్లో సరోజ పిచ్చపంటూ వస్తుందనుకోలేదు తీరా సకాలంలో పిలుపువచ్చేసరికి "అవును, ఎవరి మీద అలుగుతారు? అందరాని పండు కాంక్షించటం వాళ్ళదే తప్పు" అనుకుంది సరోజ పెళ్ళికి వెళ్ళలేదు అందరూ "అదేమిటమ్మా! 'మేనరికం' చేసుకున్నావు కాదు?" అని అడుగుతుంటే తనకు వళ్ళుమండిపోతుంది!

"శేఖర్ పెళ్ళయింది, ఇంక బ్రతికానూ" అనుకుంది సరోజ

తనెంత తప్పుకు తిరిగినా 'మేనరికం', 'మేనరికం' అంటూ అంతా తనను శేఖర్ పెళ్ళాంక్రింద జమకట్టి పరిహాసాలాడుతుంటే తనకు తీరని తలవంపులుగా వుండేది కంపరంతో కళ్ళమ్మట నీళ్ళు నిండి లజ్జాభిమానాలతో మనస్సు ముకుళించుకుని పోయేది

"ఇప్పటికి తగింది బెడద!" అనుకుని హాయిగా వూపిరిపీల్చింది సరోజ

## 2

"ఏమే, సరోజా! మీ శారదత్తావాళ్ళొచ్చారు, రా, రా" అని శాంతమ్మ డ్రాయింగురూంలోనుంచి కేకవేసేసరికి సరోజ చదువుతున్న పుస్తకం చటుక్కున మూసేసి వచ్చింది శేఖర్ కనుపించగానే ఎందుకో త్రుళ్ళిపడింది క్షణంలో సర్దుకుని నిర్లక్ష్యంగా శేఖర్ కేసిచూసి, శారదత్తతోటి, శేఖర్ పెళ్ళాం సావిత్రితోటి మాట్లాడుతూ కూర్చుంది సరోజ

"సరోజా! పెళ్ళికివచ్చావ్ కాదేమే?" అనడిగింది శారదమ్మ మాటలమధ్యలో యధాలాపంగా

సరోజ ఏం చెప్పటానికీ తోచలేదు "అప్పుడు మాకు పరీక్షలు" అనేసింది నిర్లక్ష్యంగా

"వేసవి కాలంలోకూడా మీకు పరీక్షలేనా ఏమిటే?"

శారదత్త అలా అనేంతవరకూ సరోజకు తనపొరపాటు జ్ఞాపకం రానేలేదు గుర్తొచ్చాక శేఖర్ కు కనిపించకుండా నాలిక కరుచుకుని మొదలుకుండా వూరుకుంది

వెళ్ళబోయేముందు సావిత్రి "మా ఇంటికి తప్పక రావాలి అక్కయ్యా!" అని మరీమరీ ఆహ్వానించి వెళ్ళింది

శారదత్తకూడా "సెలవురోజున ఎప్పుడన్నా ఓమాటు అటురావే సరోజా! ఏదో శేఖర్ కు బదిలీఅవటం మూలాన ఈవూరికి రావటమైంది కాని లేకపోతే మీ రెక్కడో, మేమెక్కడో" అంది

"అలాగేలే" అంది సరోజ పెడసరంగా

సావిత్రి అందమైనదీకాదు తెలివైనదీకాదు—చదువూలేదు

'కంతకుతగ్గబొంత' ఆవుద్యోగానికి అంతకంటె మంచిపెళ్ళాం దొరుకుతుం దేమిటిలే" అనుకుంది సరోజ

పదిహేనురోజుల తర్వాత శారదమ్మ ఒత్తిడి చేయటం వల్ల ఓమాటు శాంతమ్మకూ సరోజకూ శేఖర్ ఇంటికివెళ్ళటం తప్పనిసరైంది

ఒక ఇరుకిరుకు మురికి పేటలో శిథిలావస్థలో వున్న ఎలుకకన్నంలాంటి ఆఇల్లు చూసేసరికి సరోజకు తల తిరిగినంత పనయింది

"ఛీ! ఛీ! ఇదేం ఇల్లు" అనుకుంది సరోజ కళావిహీనంగా బోసిపోతూ, రోతపుడుతూ కన్పిస్తున్న ఆఇంట్లోకి అయిష్టంగా కాలు పెడుతూ

అడుగులసవ్వడి విని సావిత్రి వంటింట్లోనుంచి తొంగిచూసింది చెరిసిపోయిన చిరచేతి గోగిరితో - ముఖంమీద, చీరమీద అక్కడక్కడా మసిమరకలు జిడ్డుకారుతూ, చెమటలు కక్కుకుంటూ వున్న సావిత్రిని చూసి సరోజ గతుక్కుమంది దేవుడు మేలు చేయబట్టి గాని లేకపోతే సావిత్రి స్థానంలో సరిగ్గాతను–జిడ్డోడుతూ, పొయ్యూదుతూ! వళ్ళు జలదరించింది సరోజకు

"మామీద దయవుంచి వచ్చారు" అని నవ్వుతూ పలకరించి చేతులు కడుక్కుని వచ్చింది సావిత్రి మూలనున్న చాప తీసుకొచ్చి నేలమీద పరిచింది డ్రాయింగ్ రూంలో కుషన్ కుర్చీలమీద కూర్చోవటం అలవాటైన తనకు నేలమీద బోసి చాపమీద కూర్చోవాలంటే చిన్నతనం వేసింది కట్టుకున్న ఖరీదైన జార్జెట్ చీర ఎక్కడ నలిగిపోతుందో నని విసుక్కుంటూ ముళ్ళమీద కూర్చున్నట్టు ఇబ్బందిగా కూర్చున్నది

ఇల్లంతా కలయజూస్తూ కూర్చుంది సరోజ ఇల్లంతా ఎంత? రెండుగదులూ, ఒకవరండా! అంతా కలిపి తమఇంట్లో ఎందుకూ పనికిరాదని వాడకుండా అట్టే పెట్టేసిన మూల గదంతకూడా లేదు

ఒక డ్రాయింగురూం లేదు ఒక డ్రెస్సింగురూం లేదు డ్రెస్సులే లేవు, ఇంక డ్రెస్సింగురూం ఏం ఖర్మ అనుకుంది సరోజ, సావిత్రి కట్టుకున్న ముతక, పనిమనిషి చీరమీద అకస్మాత్తుగా దృష్టినిలిపి

మాట్లాడుతూ, మాట్లాడుతూ సావిత్రి లోపలికెళ్ళింది

శారదమ్మ ఏవేవో కబుర్లు చెప్తున్నది శాంతమ్మతో

"వట్టి పల్లెటూరిపిల్ల పాపం! అక్కా, ముక్కు లేని పిల్లమ్మ ఎంతో నెమ్మదైనది శేఖర్ ఎంతో ప్రేమగా చూసుకుంటాడు—"

సరోజకు కొన్నిమాటలు చెవిని పడుతున్నాయి, కొన్ని చెవిని పడటంలేదు ముళ్ళమీద కూర్చున్నట్లుంది సరోజ కా ఇంట్లో కూర్చోవటం

'వారానికో సినిమాకు తీసుకెళ్తాడు—"

ఎక్కడకు? పావలా తరకలోనా, బెంచీలోనా—?

గుమాస్తాజీవితం పావలాతరగతిమాన్సు! "మాచిన చీరల్లా కొంటాడు" అంటూ

శారదమ్మ కొల్లాయి గుడ్డల్లాంటి బట్టలు ముంగుపడేసింది

ఇంగులో 'పబ్బు' లోపం ఏమీ లేదు డబ్బున్న గొప్ప కుటుంబాలను కూడా చూసింది సరోజ అంతా అచ్చంగా ఇలానే వుంటారు ఎక్కడా ఏంతేడా లేదు!

ఒక వినోదం లేదు, ఒక విలాసం లేదు—ఏది లేదు!

"ఇంత అనాగరికంగా, అడవి మనుష్యులా ఎలా బ్రతుకుతారో?" అనుకుంది సరోజ విస్మయంతో

"పెళ్ళి చేసుకోకుండా ఎనా వుంటాను గాని 'గుమస్తా'ను మాత్రం చేసుకోను" అనుకుంది జుగుప్సతో

ఇత్తడి గ్లాసుల్లో కాఫీపోసి పట్టుకొచ్చింది

"అదేమిటే సావిత్రీ! కప్పులో పోసి పట్టుకురాక?" అంది శారదమ్మ

"ఎక్కడున్నాయో ఏమో, కనుపించ లేదు" అంటూ నసిగింది సావిత్రి

"పోనీ-గాజు గ్లాసులన్నా తెస్తానుండు" అని లేవబోయింది శారదమ్మ రెండుచేతుల తోట బరువుగా గ్లాసు పట్టుకున్న సరోజను చూసి

"ఫర్వాలేదు లేవే" అని సరోజ కషాయం లాంటి కాఫీని కళ్ళు మూసుకుని నోట్లో పోసుకుంది

"అమ్మయ్య! నరకంలోనుంచి స్వర్గాని కొచ్చాను" అనుకుంది సరోజ గేటు దాటి తమఇంటి ఆవరణలో అడుగు పెట్టగానే

గబగబా వెళ్ళి రేడియో ఆన్ చేసి సోఫాలో కూలబడింది

తెలిసి, తెలిసి ఆ నరకంలోనే తోయ్యాల నుకున్నాడు నాన్న అమ్మ తనపక్షం గాబట్టి సరిపోయింది గాని తన బ్రతుకేమైపోయేది?

## 3

బి ఏ ఫస్టుక్లాసులో ప్యాసయ్యింది సరోజ

అమ్మయ్య! తను ఇక సరోజ బి ఏ!

చదువులో తను తలిచినది దలిపించుకుంది తన జీవితభాగస్వామిని ఎన్నుకోవటంలో కూడా తన తెలివితేటలు బుజావు చేసుకోవాలి

తన కలలన్నీ నిజమవ్వాలి - తనజీవితం స్వర్గతుల్యం చేసుకోవాలి తనకు తగిన గెజిటెడ్ ఆఫీసర్‌ను ఎన్నుకోవాలి

ఆకాశన్నంటుకునే అందమైన భవనం - నౌకర్లు చాకర్లు - అందరి మీదా పెత్తనం చెలాయిస్తూ తను

కార్లు - క్లబ్బులు - షికార్లు - సినిమాలు

"సినిమా" తలపు రాగానే సరోజకు శేఖర్ సావిత్రిని "నారానికో సినిమా"కు తీసుకెళ్ళటం జ్ఞాపకం వచ్చింది

తనూ "అతనూ" కలిసి దర్జాగా కారు మీద సినిమాకెళ్ళి "బాక్సు" లో కూర్చుంటే శేఖర్, సావిత్రి కాళ్ళీడ్చుకుంటూ వచ్చి ఏ బెంచీ లోనో చతికిలబడతారు — పాపం! తను "మంచిది" కాబట్టి జాలిపడుతున్నది కాని వాళ్ళ కదే వైకుంఠం! పైగా అల్ప సంతోషులు!

సరోజకు నవ్వొచ్చింది

"లే లే, సరోజా! ఆ "ఇంజనీర్" గారు మధ్యాహ్నం చూసుకోవటాని కొస్తున్నారట కాస్త నీచెయ్యికూడా వేస్తేనే గాని ఇల్లు సరటం కాదు" అంది శాంతమ్మ ఇల్లంతా హడావుడిగా తిరుగుతూ

పగటి కలల్లోంచి తేరుకుని వుల్లాసంగా లేచింది సరోజ

"ఇంజనీర్?"

కార్!-షికార్!

తన స్వప్నాలు నిజంకాబోతున్నాయి!

*       *       *

"ఆ డాక్టర్ తాలుకు వారు చూడ్డానికొస్తున్నారు గాని అమ్మాయిని మొన్న టపా కావటం డా కాస్తమెరుగులు కుండా కూర్చోపెట్టి నను మొగాళ్ళతో అలా అరమరికలు లేకుండా మాట్లాడటం కొంతమంది కిష్టం వుండదు మొన్న "ఇంజనీర్" తాలుకు ఆడవాళ్ళు అమ్మాయి ధోరణి చూసి "అదేమిటి, ఆపిల్లకి సంసారి లక్షణా లెక్కడున్నాయో? సిగ్గూ, ఎగ్గూ లేకుండా మగాడు కనుపించే సరికి అలా కిలకిలాడుతూ, పకపకలాడుతూ తెగడిపి మాట్లాడేస్తుందేమిటి? అనుకుని చల్లగా జారుకున్నారట"

శాంతమ్మతో జానకిరామయ్య అంటున్న మాటలు చాటుగా విని సరోజ గతుక్కుమంది

"పెళ్ళిచూపులు" తతంగం అంతా తమాషాగా, చిత్రంగా అనిపించింది తనకు పెళ్ళికొడుకు, పెళ్ళికొడుకు తండ్రి, తాత, అక్క, అమ్మ అన్న - ఒకరేమిటి బంధువులూ, స్నేహితులూ అంతా ఓ పాతిమంది దాకా తన్ను చుట్టుముట్టేసి కళ్ళు గుర్ఛిలో అద్దాలు చేసుకుని నఖశిఖ పర్యంతమూ పరీక్షగా చూసినట్టు తనను చూస్తుంటే తను తలొంచుకుని సిగ్గుపడుతూ, భయపడుతూ బిక్కు, బిక్కుమంటూ ఎందుకూర్చోవాలి? వాళ్ళు తన్ను చూసినట్టే పెళ్ళికొడుకును తనెందుకు తేరిపార చూడకూడదు? అనే 'ఫెమినిస్ట్ స్పిరిట్'తో, లేనిపోని సిగ్గు నటించకుండా వాళ్ళున్నంత సేపూ తను కాస్త 'ఫ్రీగా' 'మూవ్' అయ్యింది అంతే! దానికి "హాతోస్మి!" అనేంటి మాటలు వినాల్సి వచ్చింది అని చెవులు మూసుకుంది సరోజ

ఆ "ఇంజనీర్" చేసుకుంటాడనే అనుకుంది తను

ఉత్తరం వచ్చేదాకా పాలిపోయిన ముఖంతో కుర్చీని కానుకుని నిల్చున్న బావ హఠాత్తుగా జ్ఞాపకం వచ్చాడు ఎవరో తన్ను మీద చరచినటయింది ఇవాళ బావ స్థానంలో తన—మన స్వేమితో 'అదోలా' అయిపోయింది తెలికుండానే నిట్టూర్చింది సరోజ

బి ఏ ఫస్టుక్లాసులో తేలిగ్గా ప్యాసైన తను అప్పుడే ఒకపరీక్షతప్పేసింది "ఇళ్ళాళ్ళ తలొంచుకుని, ముక్తసరిగా జవాబులు చెప్తూ కూర్చోవాలి బాబూ" అని లెంపలు వాయించుకుంది సరోజ కొంపదీసి "అతి

# ★ వీడని బంధం ★

వినయం ధూర్త లక్షణం" అనుకోరు గదా? అనుకుంది సరోజ

"ఐదు వేల దాక పెడతానన్నాను"

"బాబోయ్! ఐదు వేలే?" అని గ్రుడ్లు తేలేసింది శాంతమ్మ

"'అబ్బాయి దబ్బపండు లాంటి పిల్లను తప్ప చేసుకోడట' అని చెప్పేశారు"

ఆరోజు సరోజ మనస్సు మనస్సులో లేదు

తన అందాన్ని అపహాసించే వాళ్లుంటారని తన కెప్పుడూ తోచలేదు! ఉక్రోషం పట్టలేక ఏడుస్తూ కూర్చుంది సరోజ

"అదేంటే సరోజా! వాడు చేసుకోకపోతే వచ్చిన నష్టం ఏముందే? చూస్తూ వుండు-నాన్న అంతకంటె "మాంచి" సంబంధం-"

"ఛీ, ఛీ! వూరుకో! వాడు చేసుకుంటానన్నా ఇక్కడెవ్వరూ సిద్ధంగా కూర్చోలేదు?" అని కసిరి కొట్టింది, తల నిమురుతున్న శాంతమ్మను దెబ్బతిన్న అభిమానంతో సరోజ

ఆ తర్వాత తేలినవిషయం ఏమిటేఅంటే 'అబ్బాయి' పదివేలతో సహా 'చింతపండు' లాంటి అమ్మాయిని కట్టుకున్నాడని—

## 4

ఇంకా బాగా తెల్లవారలేదు మసక మసగ్గావుంది ఇంట్లో అంతా హడావుడిగా తిరుగుతూండటం చూసి "ఈ 'చూపు'లకు వేళా పాళా వుండదాయేం? ఎప్పుడుపడితే అప్పుడేనా రావటం?" అని చిరాకుపడింది సరోజ

శాంతమ్మ హడావుడిగా సరోజ గదిలోకి వచ్చి "లేచావుటే సరోజా! శేఖర్ పెళ్ళాం పోయిందట పాపం! వెళ్ళి చూసొద్దాం పదపద" అంది బద్ధకంగా కళ్ళునిరుచుకుంటున్న సరోజను చూసి

"ఆ!" అంటూ నిర్ఘాంతపోయింది సరోజ

ప్రసవించి చనిపోయింది, పాపం! సావిత్రి! శేఖర్ గాఢంగా ప్రేమించే సావిత్రి! ఏనాడు తను శేఖర్‌ను నిరాకరించిందో ఆనాడే శేఖర్ తన 'తప్పు' తెలుసుకుని తనకు తగినపిల్లను తెచ్చుకున్నాడు తనమీది ప్రేమను సావిత్రిమీదికి మరల్చుకున్నాడు

కంగారుగా మంచంమీంచిలేచి సరోజ శాంతమ్మ ననుసరించి వెళ్లింది

తీరని వ్యథతో అచేతనుడై ముడుచుకు కూర్చున్న శేఖర్‌ను చూచేసరికి సరోజకు మనసులోనే దేవినట్టయ్యింది శారదమ్మ రోదనధ్వనులు మిన్ను ముట్టుతున్నాయి

సావిత్రిని భయపడుతూ, భయపడుతూ చూసింది చిరునవ్వుతో ఆహ్వానించి పలకరించేసావిత్రి నేడు మాటా, మంతీ లేకుండా నిశ్చలంగా పడివుంది

ఒకనాడు తనుకూడా ఇలానే అయిపోతుంది 'దిక్కూ, మొక్కూ' లేని సావిత్రి 'అన్నీ' వున్నతనూ—అంతా చివరికి ఒకటే! ఏది శాశ్వతం? ముతకచీర కట్టుకున్నా ఒకటే, క్రేపుచీర కట్టుకున్నా ఒకటే! ఏచీర కట్టుకున్నా ఒకటే! ఎవర్ని 'కట్టుకున్నా' ఒకటే! ఎవరిప్రాణాలు వాళ్ళ అధీనంలో లేకపోయాక ఏది చేసినాఒకటే! నిస్సహాయంగా ఏనాడో ఒకనాడు తన ప్రాణాలుకూడా ఇలానే ఎగిరిపోతాయి

అంతా మిథ్య, మాయ, అశాశ్వతం—!

తన వూహాలకు తనేభయపడింది సరోజ

ఇంటికెళ్లిన చాలాసేపటివరకూ మామూలుమనిషి కాలేకపోయింది సరోజ మనసు మామూలు ధోరణిలో పడినతర్వాత తనవూహా లెంత అసందర్భంగా వున్నాయో గ్రహించుకుని నవ్వుకుంది

### కష్టమైనప్రశ్న; ఇట్టేజవాబు

"ఒక భార్య, భర్త, పిల్లాడు, బోటుమీద షికారుకు వెళ్లారు బోటు ఒరిగి, మునిగిపోయింది. ముగ్గురిలోనూ ఆవిడ ఒక్కర్తికే ఈతవచ్చును ఆ స్థితిలో ఆవిడ మునకలు వేస్తున్న భర్తకి చేయూతనిస్తుందా? లేకపోతే, కొడుకును కాపాడుతుందా" అని అడిగాడు ఒకాయన ఒకసభలో

చాలామంది ఆలోచనలో పడబోయారుగాని, ఒకావిడ చటుక్కున ఇలా జవాబిచ్చింది "ఎవరు తేలిగ్గా ఉంటే వాళ్ళని కాపాడుతుంది"

ఏదీ శాశ్వతం కాకపోతేనేం? ఉన్నన్నాళ్ళూ జీవితంలో 'హాయి'ని తనివితీరా అనుభవించాల్సిందే!

రేడియోలో తఱచు వినబడే ఓపాటలోని చరణం జ్ఞాపకం వచ్చింది సరోజకు

"కాకివలెను కలకాలము బ్రతకక, హంసవై క్షణమె ఆడుమురా" అవును బ్రతికితే 'హంస' లా బ్రతకాలి అశాశ్వతమైన జీవితంలోనుంచి శాశ్వతమైన ఆనందాన్ని వీలైనంత రాబట్టుకోవాల్సిందే!

శేఖర్ రోజురోజుకూ మతిలేని వాడిలా అయిపోతుంటే శారదమ్మగుండెలు తరుక్కుపోయాయి

"ఏడాదిపాటు అవీ, ఇవీ చూసొస్తేగాని వాడు మనిషి కాలేడు" అంది శాంతమ్మ కళ్ళనీళ్లు వత్తుకుంటూ

ఉద్యోగానికి సెలవుపెట్టి తల్లితో సహా కాశీ ప్రయాణమై వెళ్ళిపోయాడు శేఖర్.

"ఏమిటో ఇంతోటి దానికి సింగినాదం! 'సావిత్రి' లాంటి వాళ్లు కొల్లలు కొల్లలు. ఎవతెనో ఒకదాన్ని ముడెట్టేస్తే సరిపోదా?" అనుకుంది సరోజ

## 5

"లెక్చరర్ చేస్తున్నాడు. కానీ కట్నం అక్కరేదట—"

"అయితే ఇహనేం - నిక్షేపంలా—"

"ఆ ఆ నిక్షేపమే! ఫారిన్ డిగ్రీవుంటే ఇంకా పెద్దపని వస్తుందట అందుకని ఫారిన్

వెళ్ళాలనుకుంటున్నాడు. ఆ ఖర్చులన్నీ మనం భరిస్తే చాలునట!"

కాంతమ్మ నిర్ఘాంత పోయింది.

"కట్నం అక్కర్లేదంటే నిజమే ననుకున్నాను. ఫారిన్ కెళ్ళటం అంటే మరి మాటలతో అవుతుందండీ? అక్కడికి వెళ్ళింతర్వాత ఎన్నాళ్ళు వెలగబెడతాడో ఏమో చదువు" అని మూతి వంకరగా తిప్పుతూ "పోనీ, ఇంతోటి సంబంధం ముఖాన కొట్టి అమ్మాయినిస్తే వాడెళ్ళి ఫారిన్‌లో కూర్చుంటే కాదా? తీరా ఏ దొరసానితో దిగుతాడో? బాగుంది లెండి!" అని తీసి పారేసింది కాంతమ్మ.

"మొన్న నే ఐ ఏ యస్ లో సెలక్టయ్యాడన్నారు. అతని సంగతి కనుక్కోక పోయారూ?"

"అబ్బో! అతను చాలా ఆశలో వున్నాడు. వాళ్ళెవరో పది వేలిస్తానంటేనే పలక లేదట"

"ఊ" అని మూలిగింది కాంతమ్మ.

ఈ సంబంధాల వరుస చూస్తుంటే సరోజకు మతి పోతున్నది.

ఎవరో బట్ట తలాయన, బట్ట తలేమిటన, ఏ తలా లేదు. నున్నగా గలిమిడిలా వుంది. మచ్చుకైనా ఒక వెంట్రుక లేదు. కన్నా, ముక్కు ఎలావున్నా నెత్తిమీద నాలుగు వెంట్రుకలన్నా లేకపోతే ఇంకేమిటి? అనుకుంది చీదరింపుతో సరోజ.

వస్తున్నారు, పోతున్నారు, "పాట" పాడుతున్నారు!

"నాతరం కాదు. ఏ ఆఫీసర్ చూసినా ఆకాశంలో కూర్చుంటున్నాడు. ఏదో మనకు తగిన సంబంధం చూసుకుంటేనే మంచిది" అంటూ కాళ్లు జాపాడు జానకిరామయ్య.

"సర్లే, ఎవడినో ఒకడిని చూడండి. పెళ్ళి చెయ్యకుండా ఎన్నాళ్ళు అట్టే పెడతాం? ఏ వుద్యోగమైతేనేం లెండి మరి — కాస్త డబ్బున్న వాడినన్నా చూడండి" అని నిట్టూర్చింది కాంతమ్మ.

తగిన సంబంధం!

సరోజగొంతు ఎవరో బలవంతాన పిసికినట్లయింది.

పదివేలు, పదిహేను వేలు, పాతిక వేలు!

సరోజ హృదయం తీవ్రంగా గాయపడ్డది. తన అందం, చందం చదువు, తండ్రి హోదా దమ్మిడీకి కొరగాలేదు! అమ్మ అనుకున్నట్టు "కళ్ళు కద్దుకుని" చేసుకోవటానికెవరూ ముందుకురాలేదు. "కాస్తకట్నం" కాస్తా "జాస్తి" అయిపోయింది.

కట్నం లేకుండా చేసుకునే సహృదయత ఒక్కళ్ళలోనూ లేదూ?

నాన్న "ఆఫీసరే" అయినా తన "ముచ్చట" కోసం అంతంత కట్నం ధారపొయ్యగల శక్తి నాన్నకు లేదు. పూర్వీకులు గడించిన ఆస్తి అంతంతమాత్రం. నెల, నెలా తీసుకొస్తున్న జీతం పిల్లల చదువు సంసారాలకు, ఆడంబరంగా బ్రతకటానికీ చాలటం లేదు. "పైన పటారం, లోన లొటారం"

ఈ నగ్న సత్యం తెలిసేసరికి సరోజ బుర్ర గిర్రున తిరిగింది.

ఏదైతే వద్దని నిరసించిందో ఇప్పుడదే తన జీవితంలో సిద్ధమవబోతున్నది.

గుమాస్తా, గుమాస్తా — ఛీ! ఛీ!

దెబ్బ తిన్న అభిమానంతో, అహంకారంతో సరోజ భోరున ఏడ్చింది.

* * *

ఎవరెవరో వస్తున్నారు.

తాలూకా ఆఫీసులో గుమాస్తా. ఆస్తి బాగనేవుంది.

అతనికి ఆడపిల్లల చదువుమీద మమకారం లేదట. అందుకని చెల్లెళ్లిద్దరికీ స్కూలుముఖమే చూపించటం మానేశాడట. అయినా అమ్మాయి నచ్చింది కాబట్టి మూడు వేలుకట్నం ఇస్తే చేసుకోవటానికేలాటి అభ్యంతరమూ లేదట.

సరోజ మనస్సు చివుక్కుమంది. అంత కుసంస్కారం గలవ్యక్తితో తనేం కాపురం చేయగలగ? తనన్నా, తన చదువున్నా గౌరవించలేని వ్యక్తితో తనజీవితాన్ని ముడిపెట్టుకోవటం చేతులారా ఉరితాడు తగిలించుకోవటమే!

"గుమాస్తాకే అంతకట్నమా?" అని ముక్కుమీద వేలేసుకుంది కాంతమ్మ.

ఎవరో రెండో పెళ్లివాడు — డబ్బుంది, చిన్నవాడే, అన్నీ అనుకూలంగానే వున్నాయి. సరోజ నచ్చితే సంబంధం స్థిరపరిచేసుకుందామనుకున్నారు జానకిరామయ్య, కాంతమ్మ.

ఇంత బ్రతుకూ బ్రతికి ఇంటివెనకాల చచ్చినట్టుంది. రెండోపెళ్ళి వాడినా చేసుకుంటుంది తను? సరోజ ముఖం రోషంతో కందిపోయింది.

"రెండో పెళ్ళి వాడినా చేస్తావ్ నాన్నా!" అని బావురుమంది.

* * *

"పిల్ల ఎలావున్నా ఫర్వాలేదు. మూడు వేలిస్తే చాలు"

'పెళ్ళిచూపులు" కు జానకిరామయ్య రమ్మంటే అదీ అతని సమాధానం!

అతని క్కావల్సింది డబ్బు. ఎవరి క్కావల్సిందైనా అదే—అని నిట్టూర్చింది సరోజ.

డబ్బు కాస్తా చేతిలో పోస్తే చాలు ఓ 'గాయి'ని కట్టుకోమన్నా కట్టుకుంటాడు— సరోజ విస్తుపోయింది.

(56 వ పేజీ చూడండి)

# బాల సాహితి

## 'వల్లంపాటి'

అనగనగా రామాపురమున
ఉండే వాడొక ఘనవైద్యుడు కడు
లెక్కకు మించిన శిష్యకోటిలో
అతనికి ప్రియుడొక్కడే ఒక శిష్యుడు

గురువుకుతోడుగ శిష్యుడు వెళ్లెను
తిమ్మాపురమున రోగిని చూడగ
రోగిని చూచిన గురువిటు లడిగెను.
'సెనక్కాయలను తిన్నావా' అని

చాటు మాటుగా కొంచెంతిన్నది
ఎట్లు తెలిసెనా ఈ వైద్యునికని
నిజము నొప్పుకొని బుద్ధివచ్చెనని
లెంప లేసుకొన పాపం రోగి.

గురు శిష్యులు తమ ఇంటికి చేరిరి
శిష్యుడు బెదురుచు, వినయంతో
'కడుపులోని పదార్థ మిదేయని
కనుగొను విద్దె నెరింగింపు'మనె

'రోగి నాడి బాగున్నది నిన్న
ఇవాళ చూచిన ధైర్యం సున్న
మంచం క్రింది సెనగ తొక్కలను
చూచిన నే నది నిర్ధారించితి.'

గురువు తెల్పిన రహస్యమును విని
వైద్యవిద్య ఇక తనసొమ్మనుకొని
పొరుగూరికి శిష్యుడు వెళ్ళెను.
ధనవంతుడగు ఒక రోగి పరీక్షకు

చూచెను మంచంపై పులిచర్మం
తక్కున తట్టెను గురువాక్యం
'పులిమాంసం తినె ఈయనగా'రని
చివాట్లు పెట్టెను రోగిబంధువుల

శిష్యుని పల్కుల నాలించి
ఫక్కున నవ్విరి బంధువులు
అర్ధవిద్య లెప్పటికైనా
తెచ్చిపెట్టు ననర్థమ్ములు."



# తార రాలింది

అమ్మ పెట్టిన బువ్వ తిని, మేడ మీదికొచ్చింది ఓ చిట్టిపాప. మేడమీద చక్కని, చల్లని, తెల్లటి వెన్నెల కాస్తున్నది. ఆ తెల్లని వెన్నెట్లో పాపకోసం నందివర్ధని పువ్వువంటి తెల్లటి దుప్పటిపరచి పక్క అమర్చింది వాళ్ళమ్మ ఆ పక్కమీద ఏ కాలు ముందు పెట్టాలో అన్న సందేహం వచ్చింది పాపకు ఆ తరువాత మరొక పెద్ద భయం కలిగింది. పాలలా తెల్లగా వున్న దుప్పటిమీద కాళ్ళుపెడితే మరకలై మాసి పోతుందేమో— తన కాళ్ళని చక్కగా మట్టి వదిలేటట్లు దులుపుకుని, గుడ్డతో తుడుచుకొని మీద కాలు పెట్టింది మరక లేమీ కాకుండా వుండటం చూచి సంతోషించింది

పక్కమీద వెల్లికిలాపడుకుని ఆకాశానికేసి చూచింది వెన్నెల్లో పాపకళ్లు తళతళ మెరిసినయి. స్వచ్ఛంగా, నీలంగా ఉన్న ఆకాశము పెండ్లి పందిరిలా వున్నది. తారలన్నీ అతికినపూలల్లేవున్నయి ఆ తారల్లో చంద్రుడు చిన్నచిన్న చేమంతుల్లో పెద్ద కలువపూవులా ఉన్నాడు అందంగాఉన్నదాకాశం. ఆనందంగా చూస్తున్నది పాప.

అలా ఆకాశాన్ని సంతోషంగా చూస్తుంటే, ఓ మూల, తళుకు తళుక్కుమంటూ ఒక తార కనిపించింది. ఆ తారను చూడగానే, ఆమెతో స్నేహం చేసుకోవాలని పించింది పాపకు వెంటనే పిలిచింది. తారకూడ పాపవైపే చూస్తున్నది అందువల్ల పాప పిలుపును వెంటనే అందుకున్నది పాపను చూస్తేనే ముచ్చటగా వుంటుంది పాపతో మాట్లాడితేనో—ఎంతో బాగుంటుంది ఇలా అనుకుని తార జాలి కళ్ళతో మెరిసిపోయేలా పక్కున నవ్వింది తెల్లటి ఆమె పళ్ళవరస,

## మూర్తి

చంద్రుడి వెన్నెల్లో వింతగా రిసింది పూవుల పరిమళంలా ప్రయాణము చేసి ఆ మెఱుపు పాపను చేరి ఆమెకు గిలిగింతలు పెట్టింది తార పంపిన సందేశమర్థమై పాప కిలకిలా నవ్వింది

పాపదగ్గరకు రావాలని తారకెంతో తహతహగా వున్నది కాని ఏం చేస్తుంది? భర్తనడిగి వెళ్ళాలి తన భర్త ఎంతో దూరంలో ఉన్నాడు ఎన్నాళ్ళకొస్తాడో తన దగ్గరకు? ఆమెభర్త ఎవరో కాదు– చంద్రుడే మనకు చల్లని వెన్నెలనిచ్చే చంద్రుడే నీళ్ళమీద బంతి పువ్వులా, ఆకాశంలో తిరిగే చంద్రుడే.

చంద్రుడికి కొన్ని లక్షల భార్యలు రోజుకి కొన్ని వందలకంటె ఎక్కువమందిని చూచి పరామర్శించటాని కాయనకు వ్యవధి చాలదు కాని ఎప్పుడో ఒకప్పుడు అందరినీ చూడక మానడు జాలి గలవాడు, మంచివాడూ కనుక, భేదభావం లేకుండా, అందరినీ అనురాగంతో, సమానంగా చూస్తాడు. అతనికోసం ఎవ్వరూ పరుగెత్తుకు రాకూడదు ఇది ఆయన కరిన శాసనం. ఎవరికి వారు తనువంతు వచ్చేదాకా ఆగి వుండాలి తాను దగ్గరలేని కాలంలో బాధ కలుగకుండా తనకు సందేశాలు పంపుతూ, తనను చూడటానికి వీలుగా, అందరికి గాజుమేడలు కట్టించాడు. అందువల్ల భార్యలందరూ ప్రతిక్షణం ఆయన ఉనికిని తెలుసుకోవచ్చు

అందరిలాగే తార మందిరం కూడ గాజుదే పాపదగ్గరకు పోవాలన్న ఉత్సాహంతో ఆమె భర్తకోసం వేచి వుండలేక పోతున్నది. ఎంతసేపు కాచుకున్నా చంద్రుడు తన సమీపానికి రావటం లేదు. విసుగెత్తిపోయింది తలుపులు బ్రద్దలు కొట్టి బయటపడదామా,

# ★ తారరాలింది ★

అనుకున్నది కాని ఆమె గాజు కంటె సున్నితం గాజును కొడితే ఆమె చేయి కందిపోతుంది బాధకు వెరిచి, ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నది

ఏమిచేయాలో తోచక తన్నుకుంటూ ఉంటే ఆమె బుర్రలో తళుక్కుమన్నట్లు ఆలోచన ఒకటి మెరిసింది తనవద్దనేవున్న చంద్రకిరణాన్ని రాయబారిగాపంపి, తన కోరికను విన్నవించుకుందామని నిశ్చయించుకున్నది తన బుద్ధి వికాసానికి ఎంతో సంతోషించింది నిమిషాలమీద లేఖ పూర్తిచేసింది ఎంతో ప్రాధేయపడుతూ వ్రాసింది తప్పక భర్త అనుమతి లభిసుందన్న ఉత్సాహంతో, వరదలా పొంగుతున్న సంతోషంతో, పులకించే శరీరంతో పిలుద్దామని లేచింది— ఎవర్ని పిలుద్దామనీ — చంద్రకిరణాన్ని.

కాని - ఏముంది - ఆమెశరీరం పులకలువదిలి, మంచులా గడ్డకట్టుకుపోయింది సంతోషమంతా చచ్చిపోయింది ఆమె చేతిలో లేఖ అంతకుముందే జారిపోయింది విచారంగా కూలబడి పోయింది. అంతఃపుర మంతా ఒక్కసారిగా చీకటైపోయింది తన శరీరపు బంగారుకాంతివల్ల ఇల్లు నాలుగు మూలలా కనిపిస్తున్నది క్రింద పాపకూడ కనిపిస్తున్నది—అంతే కాని తనభర్త చంద్రుడు కనబడటం లేదు ఆయనకూ తనకూ మధ్య భూతంవంటి మేఘం అడ్డువచ్చింది తారకు భయమేసింది వణికి పోయింది మేఘుడు చంద్రుణ్ణి మింగకుండా ఉంటే చాలునని వేయి దేవుళ్ళకి మ్రొక్కుకున్నది

క్రిందికి చూచింది పాపకళ్ళలో ఆందోళన కదలించింది ఆమెకు

## హోటలు బిల్లు!

ఒక మందులకంపెనీ, ఒక ఉద్యోగిని ప్రత్యేకం పదిఊళ్ళ పర్యటనకు పంపించింది ఆ ఉద్యోగి తిరిగివచ్చాక, తనకు అయిన ఖర్చులు పద్దువేసి యజమానికి చూపించాడు. యజమాని ఆ జాబితాను ఒక్క క్షణం చూచాడు

"ఈ పెద్ద మొత్తాలు ఏవిటి?" అన్నాడు

"అవాండి అవి హోటలు బిల్లు లన్నమాట"

"అలాగాండి, బాగుంది కాని, ఇంక హోటళ్లు కొనకండి కొన్నవి చాలు" అన్నాడు యజమాని

## డార్విన్ సిద్ధాంత పరిణామం

ఇంకో రెండువేల సంవత్సరాలకు మానవుల కథాకమామీషూ ఎంత మారిపోతుందో బహుశా ఆరోజున, శాస్త్రజ్ఞులంతా కలసి, "మనమందరం మానవుడి అంశం గలవాళ్లమే. మన శరీరమే క్రమంగా పరిణామాలు చెంది ఈ స్వరూపం ధరించింది" అని ఒక సిద్ధాంతాన్ని గట్టిగా స్థాపించడం జరుగవచ్చు

మరింత దిగులేసింది తనభర్తవున్న దిశకేసి చూచింది. మేఘుడి శరీరపు టంచులు తెల్లగా ఉన్నాయి కొంత ధైర్యం చిక్కింది నల్లటిభూతాన్ని కూడ తెలుపు చేయగలిగిన తన చంద్రుడి శరీర లావణ్యాన్ని, శక్తిని తలుచుకుని మురిసిపోయింది

తిరిగి క్రిందికి చూచింది పాప ఒంటరిగా కూర్చున్నది. తారకు జాలి వేసింది తనకూ, తనభర్తకూ మధ్య నిలిచిన పెనుభూతాన్ని తన పాతివ్రత్య మహిమచూపి దండించాలనుకున్నది కళ్లురిమి చూచింది నేత్రాలు నిప్పులు కక్కినయి తీగెలా సాగి మేఘుడి గుండెలు చీల్చినయి మేఘుఁడు ఉగ్రుడైనాడు తన శరీరాన్ని పెంచాడు భూనభోంతరాళం దద్దరిల్లేటట్లు గర్జించాడు వణికిపోయింది తార పెనుగాలికి తూలిపోయే లతలా కంపించింది ఇప్పుడామెకు భర్తఛాయలు కూడ కనిపించటం లేదు భయం జాస్తి అయింది ఏడుపొచ్చింది భోరుమని ఏడ్చింది ఆమె కన్నీళ్లు భూమిమీద వాగులు, నదులుగా ప్రవహించినయి మేడమీది పాప మీదకూడ పడ్డయి పాప భయపడి లోపలి కెళ్ళిపోయింది

ఏడ్చి, ఏడ్చి తార తూలి రాలిపోయింది ఇదంతాచూసి మేఘుడు జాలిపడ్డాడు తార లాగానే తన ధనమే పోయినట్లు బాధపడ్డాడు ఏడ్చిఏడ్చి తానే నీరైపోయి, అంతరించిపోయాడు.

రాలిన తార ఎక్కడపడ్డదో___ ఎవరికీ తెలియదు పాప మరునాడు తారకోసం చూసింది ఎక్కడా కనపడ లేదు ఎప్పుడో తన స్నేహితురాలు తనకు కనిపిస్తుందనే నమ్మకంతో ఎదురుచూచి, చూచి పాప పెద్దదైంది కొన్నాళ్ళకి అంతా మరిచిపోయింది

కాని పాపం - చంద్రుడు మాత్రం తనతారకోసం యిప్పటికీ వెతుకుతూనే వున్నాడు. ★

బాలసాహితి సీరియల్

# సాగరగర్భంలో సాహస యాత్ర



మూలం: జూల్స్ వెర్న్

## 26

## జలాంతర్గామికి గట్టిదెబ్బ

ఆ మర్నాడే జలాంతర్గామి తిరుగు ముఖం పట్టింది. దక్షిణధ్రువంలో అప్పుడే రాత్రి ప్రారంభమయింది. వాతావరణంవేడిమి సెంటిగ్రేడ్‌లో సున్నకింకా 12 డిగ్రీలవరకు కిందికి దిగిపోయింది. నీటిపైన మంచుగుట్ట లింకా ఎక్కువగా పెరిగిపోయాయి.

తిమింగిలాలు మొదలయిన వన్నీ ఆ మంచుబాధ భరించలేక నీటి అట్టడుగు భాగానికి వెళ్ళిపోయాయి. ఇక సముద్రసింహాలు మొదలయిన దక్షిణధ్రువ ప్రాణులన్నీ మంచు గుట్టలలో గోతులు తవ్వుకుని వాటి లోనే నివసించాయి.

జలాంతర్గామి క్రమ క్రమంగా వెయ్యి అడుగుల లోతువరకు మునిగిపోయింది. గంటకు 15 మైళ్ళ వేగంతో సాగిపోయింది.

ఆ సమయంలో నేనిక చేసేదేమీ లేక మా యాత్రను గురించిన వివరాలన్నీ రాస్తూ కూర్చున్నాను.

మేమంతా జలాంతర్గామిలో ప్రవేశించి అప్పుడే అయిదున్నర మాసాలయింది. అయిదున్నర నెలల కాలంలోను ఎన్నెన్ని వింతలు చూచాము! ఎన్ని అత్యద్భుత విషమఘట్టాలు గడిచి బయట పడ్డాము!

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

అనువాదం: "వినాయక"

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

అలాగ రెండుమూడు రోజులు గడిచిపోయిన తరవాత ఒకనాడు తెల్లవారుఝామున 3 గంట లయ్యేసరి కొకభయంకరమైన శబ్దం వినిపించింది. ఆ దెబ్బతో నేను నా పరుపుమీదినించి కింద పడిపోయాను. జలాంతర్గామి లోపల గబగబా పరిగెడుతున్న సందడి వినిపించింది. నా గదిలోపల సామానులన్నీ చిందరవందరగా పడిపోయాయి.

అంతలో నెడ్‌లాండ్ కౌన్సెలు లిద్దరు అక్కడికి వచ్చారు.

"ఏమిటీగోల?" అన్నాను.

"నేను అది కనుక్కోడానికే వచ్చాను" అన్నాడు కౌన్సెల్.

నేను జలాంతర్గామి యంత్రాల కేసి చూశాను. నాటిలస్ 180 నిలువులలోతున ప్రయాణం సాగిస్తూంది:

"అయితే ఇంత చప్పు డెందుకయింది?" అన్నాను.

"ఏమో! కెప్టెన్ నీమో నడిగితేనే గాని తెలియదు!" అన్నాడు కౌన్సెల్.

తరవాత మేమంతాకలిసి అతడెక్కడ ఉన్నాడో అని వెతకడం మొదలుపెట్టాము. అంతలోనే అతడక్కడికి వచ్చాడు. రాగానే నే నడిగాను:

"ఏదైనా ప్రమాదం జరిగిందా?"

కెప్టెన్ అవునన్నట్లుగా తల ఊపాడు

"చాలా పెద్ద ఆపదలోనే పడి పోయామన్న మాట!"

"ఏమో ఇంకా నిశ్చయంగా చెప్పలేను" అన్నాడు కెప్టెన్.

"అయితే జలాంతర్గామి కేమైనా గట్టి దెబ్బ తగిలిందా?"

"అవును" అన్నాడు కెప్టెన్

ఆసమాధానంతో నా గుండె బేజారెత్తిపోయింది

"దెబ్బ ఎలాగ తగిలింది?" అని మళ్ళీ అడిగాను కెప్టెన్ నాతో అన్నాడు:

"దీనిలో నావికులవల్ల జరిగిన పొరబాటేమీ లేదు. ఒక పెద్దమంచు కొండ కొంచెం ఉష్ణ పరిసరాలలో ప్రయాణం చేస్తూంటే ఆ వాతావరణం మూలంగా కొండలో కొంతభాగం కరిగిపోతుంది వెంటనే ఒక్కొక్కప్పుడది తల్లకిందులై పోతూంటుంది. అలాంటిదే ఒక మంచుకొండ హఠాత్తుగా తల్లకిందులై పోయింది. అలా తల్లకిందులై పోయినప్పుడు దానిశిఖరం మన జలాంతర్గామికి తగిలింది ఆ శిఖరం జలాంతర్గామి మీదే ఆనుకొని ఉంది"

"అలాంటప్పుడు జలాంతర్గామిని మరి పైకి తేల్చే మార్గమేమీ లేదా?"

"ప్రస్తుతం మన నావికులందరు, ఆ ప్రయత్నంలోనే ఉన్నారు"

కెప్టెన్ నీమో అలాగ చెప్పినా నాకెందుకో ఆ విషయంలో అంతగా ధైర్యం కలగలేదు

క్రమక్రమంగా నాటిలస్ మీద ఉన్న మంచుగుట్ట పక్కకు తొలిగి పోయింది నావికులందరు బతికి బైటపడ్డామని అనుకొన్నారు. అంతలో కెప్టెన్ నీమో ఆ సమీపంలో తచ్చాడుతున్నట్టు కనిపెట్టాను. నేనతనిదగ్గిరికి వెళ్లాను:

"మళ్ళీ జలాంతర్గామి సముద్రం మీద తేలుతుందా?" అని ఎంతో కంగారుగా అడిగాను

"తప్పకుండా" అన్నాడు ..ప్టెన్.

కాని నాటిలస్ పైకి తేలలేదు. కెప్టెన్ ఆజ్ఞ ప్రకారమే నావికులు జలాంతర్గామిని పైకి తేలనివ్వ లేదని తెలిసింది

అలాగే పైకి తేలిఉంటే అది వెనకన మేము దాటివచ్చిన మంచు గట్టుకు ఢీకొనేదే!

అంతలో కౌన్సెలు నా దగ్గరికి వచ్చాడు

"చూపువాసిలో తప్పిపోయింది కాని లేకపోతే మన అందరిపని అయిపోయింది దన్నమాటే!"

"నిజమే! చాలా కొద్దిలో పెద్ద ఆపద తప్పిపోయింది"

తరవాత నెడ్ లాండ్ మేమున్న చోటికి వచ్చాడు.

## జరిగిన కథ:—

అది 1866 వ సంవత్సరం ప్రారంభం సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది సముద్రంలో ప్రయాణంచేసే నౌకలకది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొనవలసిందని ప్రార్థిస్తాడు అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కౌన్సిల్‌తో సహా ఓడ ఎక్కుతాడు అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ ఆమహాసముద్రంలో ప్రవేశిస్తుంది అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతరంగాలమీద ఒక పెద్ద వెలుగుకనిపించింది ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్ళవర్షం కురిపించారు అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది ప్రొఫెసర్ అరోనా, కౌన్సెల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తాడు కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్టుగా భోజనం పెడతారు కెప్టెన్‌నీమో ఇక ఆ ఓడలోనించి ఎవరు బైటపడలేరని చెప్పి ప్రొఫెసరు అరోనాకు జలాంతర్గామి యంత్రాల రహస్యాలు తెలియజేస్తాడు కెప్టన్ నీమో జలాంతర్గామి నడిపించేపద్ధతి అంతా ప్రొఫెసర్ అరోనాకు తెలియజేస్తాడు పిమ్మట జలాంతర్గామి కిరువైపులా తెరచుకున్న అద్దాలలోనించి అద్భుతమైన సాగరగర్భ జలచరాలు కనిపిస్తాయి ఆ తరవాత జలాంతర్గామి సాగరగర్భంలోని క్రెస్పో ద్వీపానికి బయలుదేరుతుంది జలాంతర్గామి వానికోరో ద్వీపంమీదుగా వెళ్ళి గిలోబ్వాద్వీపానికి సమీపంలో నిలబడుతుంది అరోనా అనుచరులతో కలిసి ఆ ద్వీపంలో ప్రవేశిస్తాడు ముగ్గురు గిలోబ్వా ద్వీపంలో వేటమొగించుకొని వస్తూండగా హఠాత్తుగా ఒక రాయి వారిదగ్గర పడుతుంది పిమ్మట కెప్టెన్ నీమో వజ్ర యుఘంతో ఆటవికులనందరినీ హడలగొట్టవేస్తాడు క్రమంగా జలాంతర మి పగడాలదీవి జేరుకుంటుంది చనిపోయిన నావికుని కొకనికి అక్కడ సమాధి ఏర్పాటుచేసారు కెప్టెన్ నీమో మన్నారు సింధుశాఖలో ఒక పెద్దముత్యం సంపాదిస్తాడు పిమ్మట ఎంతో చాకచక్యంతో ఒక జెస్తవాని ప్రాణాలు సంరక్షిస్తాడు పిమ్మట జలాంతర్గామి మధ్యధరాసముద్రందాటి అట్లాంటిక్ మహాసముద్రంలో ప్రవేశస్తుంది తరవాత జలాంతర్గామి నావికులు విగో అఖాతంలో మునిగి వెండిబంగారాలపోగులు సేకరిస్తారు కెప్టెన్‌నీమో ప్రొఫెసర్ అరోనాకుఅట్లాంటిస్‌ఖండం చూపిస్తాడు జలాంతర్గామి సముద్రం అట్టడుగున ఉన్న బొగ్గుగనులలోనించి బొగ్గు నింపుకుంటుంది క్రమంగా దుర్భేద్యమైన మంచుకొండ అడుగునించి ప్రయాణంచేసి దక్షిణధ్రువం సమీపిస్తుంది తరవాత కెప్టెన్ నీమో దక్షిణధ్రువం కనిపెట్టి అక్కడ తన జండా ఎగరవేస్తాడు

# ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

"అప్పుడే ఆపదలన్నీ గడిచి బైటపడ్డామని అనుకుంటున్నారేమో! ఇంకాముందుంది ముసళ్ల పండుగ!"

అని ఇంకా ఏమేమో చెప్పబోయాడు నేనతనితో లేనిపోని వాగ్వాదం పెంచుకోదలచుకోలేదు. అందుచేత అతని ఎత్తిపొడుపు మాటలన్నీ విని విననట్లుగా మాట్లాడక ఊరుకున్నాను నాటిలస్ అలాగే ఇంకా కొంచెందూరం ప్రయాణం సాగించింది గాని ఆ తరవాతే మాకొక గడ్డు సమస్య ఎదురయింది

మేము పూర్వం దాటి వచ్చిన మంచుగుట్ట మాకెదురయింది ఇక మా జలాంతర్గామి ఎటు పోవడానికీ దారి కనబడలేదు. పోనీ సముద్రం పైకి తేలవచ్చునేమో అనుకుంటే నాటిలస్ మంచుగుట్ట అడుగు భాగానికి రకీమని ఢీకొంటుంది ఇక ఎలాగ ఈ ఆపత్తు దాటి బైటపడడం?

ఇంక ఒకటే మార్గం ఉంది నాటిలస్ కొన్ని వందల గజాలు వెనక్కి వెళ్లిపోయి ఎక్కడైనా ఏదయినా దారి ఉందేమో కనిపెట్టి మెల్లిగా బయటపడాలి

మా జలాంతర్గామిలో దీపికలన్నీ ధగద్ధగాయమానంగా వెలిగిపోతున్నాయి చుట్టూరా ఉన్న మంచుగుట్టల గోడలమీద పడిన ఆ కాంతులన్నీ చిత్ర విచిత్రమయిన రత్నాలలా వెలిగిపోయాయి

ఒక్కొక్కచోట వేలాది ఇంద్రనీల మాణిక్యాలు గుట్టలు గుట్టలుగా పోసినట్టు కనబడింది. మరి ఒకచోట పచ్చలు గుట్టలుగుట్టలుగా పోసినట్టు కనబడింది

ఆ విచిత్ర సౌందర్యం కళ్ళతో చూచితీరవలసిందేగాని మాటలతో వర్ణించడం చాలాకష్టం.

కౌన్సెల్ అవి చూచి "అత్యద్భుతం!" అని ఇక నోటమాట లేక అలాగే నిలబడి పోయాడు

కొంత సేపటికి మా కళ్ళు వెలుగులు తళతళలు చూడలేక పోయాయి క్రమంగా నాటిలస్ శరవేగంతో సాగిపోయింది.

కౌన్సెలు ఆ అత్యద్భుత దృశ్యాలు తలుచుకుంటూ "ఈ విచిత్రంతో సరిపోలిస్తే మన ఖండాలలో ఉండే అద్భుతాలేపాటి?" అని అదే ధోరణిలో ప్రసంగించడం మొదలుపెట్టాడు

నెడ్‌లాండ్ ఆ అద్భుతాలన్నీ చూస్తూనే ఉన్నాడు కాని అతనికి కౌన్సెల్ ప్రశంసలేమీ నచ్చలేదు

"కౌన్సెల్! నీకాభయం అక్కరలేదు మనం మళ్ళీ మన దేశంలో అడుగుపెట్టంలే! మనందరి పనీ అయిపోయిందన్నమాటే!"

ఆ మాట విని నేనతని కోపం ఇంకా చల్లారలేదనీ ఇక అప్పుడేమన్నా లాభం లేదనీ అనుకొన్నాను

అప్పటికి సాయంత్రం అయిదు గంటలయింది జలాంతర్గామి వెనకనడక ప్రారంభించింది.

నెడ్‌లాండ్ అది గమనించాడు.

"ఈధోరణిచూస్తే మన ప్రయాణం చాలా ఆలస్యం అయ్యేటట్లుందే!"

"పోనిలే కొన్ని గంటలే కదా ఆలస్యం అయ్యేది' ఇంతలో మునిగిపోయిందేముంది?" అన్నాను.

తరవాత నెడ్‌లాండ్ అక్కడినించి వెళ్లిపోయాడు యంత్రాలకేసి చూస్తే జలాంతర్గామి ఇంకా 9 వందల అడుగుల లోతులోనే ప్రయాణం చేస్తూన్నట్టు తెలిసింది. తరవాత నేను గడియారంకేసి చూశాను 8 గంటల ఇరవైఐదు నిమిషాలయింది

అదేసమయంలో మళ్ళీ ధామ్మని ఒక పెద్ద చప్పుడైంది ఈసారి జలాంతర్గామి వెనకభాగంలో బాగా గట్టిదెబ్బ తగిలింది నేనా దెబ్బవిని నిర్ఘాంతపోయాను అంతలో నెడ్‌లాండ్, కౌన్సెలులిద్దరు అక్కడికి పరిగెత్తుకు వచ్చారు

మేమిక ఏమిచెయ్యడానికి పాలుపోక ఒకళ్ళొకళ్ళ చేతులు గట్టిగా పట్టుకుని నిలుచున్నాము మాకేదో పెద్ద ఆపద రాగలదని నిశ్చయించుకొన్నాము

అంతలోనే కెప్టెన్ నీమో అక్కడికి వచ్చాడు. నేనాయన దగ్గిరగా వెళ్ళాను

"మనం దక్షిణంగా వెళ్ళడానికి గల దారులన్నీ కట్టుబడి పోయాయా?"

"అవును! మంచుకొండ మన దారి కప్పివేసింది"

అన్నాడు కెప్టెన్.

"అయితే మన కిక దారిలేదన్న మాట!"

"అవునంతే!" అన్నాడు కెప్టెన్.

మా కెటుచూసినా మంచు గుట్టలుతప్ప మరేమీ కనబడలేదు. మేమొక పెద్ద మంచుకోటలో చిక్కడిపోయామన్నమాట నెడ్

ం. ఈ పరిస్థితి అంతా చూచి గుసగుసలాడుతూ ఎదురుగా ఉన్న బల్లమీద పిడికిలితో గట్టిగా ఒక్క దెబ్బ కొట్టాడు నేనాసమయంలో కెప్టెన్ కేసి చూశాను కెప్టెన్ అంత మాత్రంచేత కంగారు పడిపోలేదు అతనిముఖంలో ధైర్యసాహసా లెక్కడా చెక్కుచెదరలేదు. మా అందరికేసీ చూసి నెమ్మదిగా ఇలా గన్నాడు

"ప్రస్తుత పరిస్థితుల్లో మనం ఈ ఆపత్తు గడిచేమార్గమేమీ కని పించడం లేదు మనం అందరం చావుకు సిద్ధపడవలసిందే! అందరు ఈ కొండలకింద పడి పిండి పిండి అయిపోవచ్చును అది జరగకపోతే పీల్చుకోడానికి గాలిలేక చచ్చిపో వలసి వస్తుంది ప్రస్తుత పరిస్థితు లలో అంతకంటె మార్గాంతర మేమీ కనబడడంలేదు"

"మన కంతగాలి లేకుండా పోతుందనే భయంలేదు ఇంకా కావలసినంతగాలి ఉంది" అన్నాను

"నిజమే! ఈ గాలి రెండు రోజు లలో అయిపోతుంది అప్పుడే 36 గంటలనించీ మనం నీటిలో ఉన్నాము ఇంక 48 గంటలలో మనం నిలవ చేసిన గాలి అంతా అయిపోతుంది"

"అయితే ఎలాగో అలాగ ఈ 48 గంటలలోను మనమీ ఆపద లోనించి బయటపడాలి"

"ప్రయత్నంచేదాము మనకెదు రుగా ఉన్న మంచుగోడ బద్దలు కొట్టాలి"

"అది ఏవైపున ప్రారంభిస్తారు?"

"కొంచెం తవ్వి చూస్తే తెలుస్తుంది నావికుల్ని కొందర్ని నీటిలోకి పంపించి గోడ బద్దలుకొట్టించే ఏర్పాటు చేస్తాను"

"అయితే కొంచెం అద్దాలు తెరవ వచ్చునా?"

"ఓ తప్పకుండా! ఇప్పుడు జలాంతర్గామి కదలడం లేదు"

అని కెప్టెన్‌నీమో లోపలికి వెళ్ళిపోయాడు. తరవాత నాటిలస్ బాగా లోతుగా మునిగిపోయింది సముద్రం అట్టడుగు దాకా వెళ్ళి నేల మీద నిలబడింది నేను నా మిత్రు లిద్దరికేసి చూశాను:

"పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉంది అయినా గుండె నిబ్బరం విడిచిపెట్టకూడదు"

"మన అందరి క్షేమంకోసం ఏమి చెయ్యమన్నా నేను సిద్ధంగానే ఉన్నాను" అన్నాడు నెడ్‌లాండ్

నేను నెడ్‌లాండ్‌తో కరచాలనం చేస్తూ—"చాలా బాగా మాట్లాడావు!" అన్నాను

"కెప్టెన్ నీమో కెలాంటి సహాయం కావలసివచ్చినా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు నెడ్‌లాండ్ మళ్ళీ

"కెప్టెన్ నీమో తప్పకుండా నీ సాయం అంగీకరిస్తాడు" అన్నాను

వెంటనే ఆ సంగతి కెప్టెన్ నీమోతో చెప్పాను

అది విని అతడెంతో సంతోషించాడు

తరవాత నెడ్‌లాండ్ సాగర గర్భంలో దిగే దుస్తులు వేసుకొని జలాంతర్గామి నావికులతోబాటు సముద్రంలోకి దిగాడు. ఆ నావికు లందరు గొడ్డళ్లు చేత బుచ్చుకుని మంచుగుట్ట బద్దలుకొట్టడం మొదలు పెట్టారు ప్రత్యేకంగా ఒక ప్రదేశములో ఆ గుట్ట బాగా సన్నగా ఉన్నట్టు కనబడింది ఆ ప్రదేశం లోనే పని ప్రారంభమైంది.

మా జలాంతర్గామిలో గాలి రెండు రోజులవరకే సరిపోతుంది. అయితే ఇంకా నాలుగైదు రోజులు పనిచేస్తేనే గాని మంచుగుట్ట తెగగొట్టడం పూర్తి కాదు నేనుకూడా గొడ్డలి చేత్తో పుచ్చుకొని మంచుగోడ పడగొట్టే పనిలో పడ్డాను

కాని ఎంత కొట్టినా గోడలో దారి కనబడలేదు మేమంతా బాగా అలిసిపోయాము

క్రమ క్రమంగా నాటిలస్‌లో గాలి అంతా అయిపోయే సమయం సమీపించింది మాకూపిరి పీల్చుకోవడం కూడా కష్టమైపోయింది.

నాతల తిరిగిపోయింది కొంతసేపటినించి తగినంత గాలి లేకపోవడంచేత నాకు స్మారకంకూడా తప్పిపోయింది మళ్ళీ మెళుకువ వచ్చింది నెడ్ లాండ్ కొన్సెలు లిద్దరు తమకోసం నిలవ చేసుకొన్న గాలిలో కొంతభాగం నాకోసం వినియోగించి నా ప్రాణాలు రక్షించారు లేకపోతే నేనా క్షణంలోనే చనిపోయి ఉండవలసింది

ఆ పరిస్థితిలో కెప్టెన్ నీమోకొక చక్కని ఆలోచన తట్టింది జలాంతర్గామి ఒక మంచుప్రదేశంలో నిలబడి ఉంది.

కెప్టెన్ నీమో జలాంతర్గామి నిండా నీరు నింపవలసిందని ఆజ్ఞాపించాడు జలాంతర్గామిలో పట్టినంత వరకు నీరు నింపారు ఆ బరువుతో జలాంతర్గామి అడుగున ఉన్న మంచు ముక్కలు ముక్కలుగా బద్దలైపోయింది వెంటనే జలాంత

(56 వ పేజీ చూడండి)

# వనితా లోకం

## వదినా
### తీరిక సమయాలలో గృహ పరిశ్రమలు

**ఎ. మాణిక్యాంబ**

తాంబూలంలోకి ఆకు, వక్క, యాలకులు, లవంగాలు, జాజికాయ, జాపత్రీ, పచ్చ కర్పూరం, కుంకుమ పువ్వు వగైరాలు వాడుతారు. ఆకు, వక్క మాత్రం వాడుకునే వారూ లేక పోలేదు. ఆకుకు సున్నం రాచి మడిచి నోట్లో వేసుకుంటే అదీ తాంబూలమే వనిపించుకుంటుంది. కాని మిగతావన్నీ కూడా వేసుకుంటే ఉన్నంత రుచి, సువాసన, ఆనందం వుండదు. అందువలన చాలామంది ఈ వస్తువులన్నీ విడివిడిగా తెచ్చి వుంచుకుని వాడుకుంటూ వుంటారు. వీటిని వాడుకోడంలో అన్నీ సమంగా వాడరు. తేవటం ఎంతకని పెట్టి తెచ్చినా ఒకొక్కటి ముందు అయి పోతుంది. ఇంకోటి మరి నాలుగు రోజులు ఎక్కువ వస్తుంది. ఆ వస్తువు అయిపోయిందని తీరా భోజనము చేసి చూచుకున్నపుడే గుర్తుకు వస్తుంది. సరే పోనీలే ఈ పూటకి ఎలాగో ఒకలా కాలక్షేపం చేద్దామని అనుకొని, ఆ వస్తువు లేకపోయినా సరేనని అనుకుంటాము. కాని అదేంకర్మమో అది లేని లోటు కన్పిస్తూనే వుంటుంది.

"ఆమాటా నిజమే వదినా! మొన్న నీ మధ్య "తాంబూలంలోకి సున్నం" చేసే పద్ధతి చెప్పిన తరువాత ఆ వస్తువులు అన్నీ తెప్పించి తయారు చేశాను. ఎంతో బాగుందని మీ తమ్ముడు తాంబూలం వేసుకున్నపుడల్లా అన్నారు. కాని, నిన్న మిగతా వస్తువులు కూడా అయిపోయినాయి. తెప్పించటము గుర్తులేకపోయింది. రాత్రి అసలు తాంబూలం వేసుకున్నట్లే లేదు. నిన్న ప్రత్యేకంగా తోటలోనుంచి లేతచిగుళ్లు కోయించి తెప్పించారు. కాని మిగతా వస్తువులు ఏమీ లేకపోవటం వల్ల రుచీ, పచీ లేకుండా పోయింది. నీ పుణ్యమా అంటూ సున్నం తయారుచేసి పెట్టాను. అది రాచాము గనుక మరీ అన్యాయంగా లేదు. ఈ పూటనైనా తెప్పించాలి. అయినా ఒకపని చేస్తే బాగుంటుంద మనకుంటా విడివిడిగా ప్రతిదీ తెప్పించటం, వాటిల్లో ఏదో ఒకటి అయిపోవటం ఇదొక ఇబ్బందిగానే వుంది. కిళ్లిలలో వాడే సుగంధ ద్రవ్యాలు అమ్ముతారుట. అవి తెప్పిస్తే బాగుండేట్లుగా వుంది.

"బోలెడు ఖరీదు పెట్టి వాటిని తెప్పించటంకన్న మనమే చేసుకుంటే మంచిది కదూ?"

కుమారి ఉష భరతనాట్య శాస్త్రాభ్యాసం ముగిసిన సందర్భంలో అక్టోబరు ౮వ మ్యూజియం థియేటర్ లో 'అరంగేట్రం' (తొలి ప్రదర్శనం జరిగింది.) ఈమె శ్రీ కె. ఆర్. కృష్ణస్వామిగారి కుమార్తె.

"మంచిది కాదని ఎవరన్నారు? ఆ వాడు సున్నం చేసేటప్పటికి నానా అవస్థా ఐంది. పావలా డబ్బులు మనవి కావనుకుంటే యీ శ్రమ వుండేది కాదుగదా అ[illegible]న్నను. కష్టపడిచేసినా చాలా చౌకగా తయారైంది. కాని ఇటువంటి పనులు వదినా! మనం చేసుకో తగినవైనా చెయ్యలేము. ఏమంటావు?

"ఏం? మనకేమన్నా కొమ్ములు మొలిచాయా?" ఆ పావలా డబ్బులు కలిసివస్తే ఇంకోదానికి వాడుకోవచ్చుగదూ? ఇంతకీ తాంబూలంలోకి వాడేటందుకు సువాసనగా వుండే మాత్రలు చేసే పద్ధతి చెపుతాను చేసావా?

"చెయ్యకపోతే నవ్వాయకుంటావు? "అడపదుచు అర్ధమొగుడ"న్నారు గాని నీకు నిండుమొగుడున్నంత హోదావుంది. ఊఁ, చెప్పు. వ్రాసుకొని అట్లాగే తయారు చేస్తాను. ముందు ఏ యే వస్తువులు కావాలో చెప్పు."

| | |
|---|---|
| అతిమధురం(యష్టిమధుకం)పొడి | 2తులములు |
| ఏలకులు | ½ ,, |
| లవంగాలు | ¼ ,, |
| దాల్చినచెక్క | ¼ ,, |
| మంచికుంకుమపువ్వు | ¼ ,, |
| పన్నీరు | |



"ఏ ప్రొద్దుదిక్కు–"  ఫొటో: పి. సాంబశివరావు, హైద్రాబాదు.

అతిమధురం అంటే ఏమిటి?

తాంబూలంలో వాడే సువాసనద్రవ్యాలన్నిటికి మూలపదార్థం "అతిమధురం" బజారులో ఏ కొట్లోనైనా అమ్ముతారు. పొడుం మాత్రలు చేసినా, బజారులో కిళ్ళీలలో వాడే సువాసనద్రవ్యాలు అని అన్నావే, అని చేసినా యీ అతిమధురంతో చే చెయ్యాలి. ఇది తియ్యగా వుంటుంది ఒక చెట్టుయొక్క వేరు. దానిని తెచ్చి మెత్తగా బలగ్గొట్టి పొడుము చేసి వాడుతారు"

"వీటిని తెచ్చి ఏమిచెయ్యాలి?"

"ముందుగా అతిమధురం మెత్తగా పలగకొట్టి పొడుం చేసి వస్త్రఘాళితం చెయ్యాలి"

"బజారులో ఏలకిగింజలు అమ్ముతారు. అవి పనికివస్తాయా లేక ఏలక్కాయలే తేవాలా?"

"గింజలకన్న కాయలే సువాసనగా వుంటాయి. అందువలన కాయలే తెచ్చి ఒలిచి, గింజలను తూచి వాడాలి"

"దాల్చిన చెక్క కూడా కావాలన్నావు. అదొక రకమైన వాసనగా వుండదూ?"

'నిజమే. కొందరికి ఆవాసన పనికిరాదు. కొందరికి అదంటే ఎంతో ఇష్టం. అందువల్ల వారివారి ఇష్టానిష్టాల ననుసరించి వాడుకోవాలి

పన్నీరు బజారులో అనేక రకాలుగా అమ్ముతున్నారు. ఏది మంచిది?'

సీసాలు కడిగి వాటిలో మంచినీరు పోసి నాలుగైదు చుక్కలు గులాబీ ఎస్సెన్సు వేసి బిరడాలు పెట్టితే పన్నీరు అయిపోతుంటుంది. కొనదలుచుకుంటే ఎక్కువ ఖరీదు పెట్టి కొన్న పన్నీరు మంచిదని తృప్తిపడవలసినదే"

"వీటన్నిటిని తెచ్చి ఏం చెయ్యాలి?"

"ఈ వస్తువులన్నిటిని తెచ్చి విడివిడిగా పొడుము చేసి తూచి అన్నిటినీ కలిపి ఒక కల్వంలో వేసి పన్నీరు పోసి మెత్తగా నూరాలి కాని కుంకుమపువ్వు మాత్రం ముందుగా కలిపి నూరకూడదు. చివరకు వేసి నూరాలన్న మాట"

"పన్నీరు ఎంత కావాలో చెప్పలేదే"

"పన్నీరు పరిపడినంత వెయ్యాలి ఈ వస్తువులన్నీ పన్నీరుతో కలిపి నూరితే ఆ ముద్ద గట్టిగా మాత్రలు చేయడానికి వీలుగా వుండేలాగున పొయ్యాలి"

"మెత్తగా ముద్దలాగున నూరిన తర్వాత ఏం చెయ్యాలి?

"ఏముంది? దానిని పెసరగింజలంత మాత్రలుచేసి ఒక పళ్ళెంలో కొ[illegible] నాలుగు రోజులు నీడలో ఆరబెట్టి తరువాత సీసాల్లో పోసి ఒకటి లేక రెండు మాత్రల చొప్పున వాడుకుంటే తాంబూలం ఎంతో బాగుంటుంది నిజమే నంటావా?"

"నిజమే వదినా! తప్పకుండా తయారు చేస్తాను"— ★

వేషాలు దొరకక ప్రాణం విసుగెత్తిన ఒక నటుడు ఒక కంపెని అధిపతిదగ్గిరకు ఆఖరుసారిగా వెళ్లాడు.

"కనీసం చచ్చిపోయిన శవం బయటినుండి కోలాహాలం, కనబడని, మనిషి లాంటి వేషాలేనా ఇవ్వండి." అన్నాడు

## కట్టూ, బొట్టూ:

# సలహాలు

### సి. వి. విజయలక్ష్మి

కాలేజీలో చదువుకునే ఆడపిల్లల కోసరం అని అమెరికాలో ఫాషన్ పత్రికలు ఏడాదికోసారి ప్రత్యేకంగా, సప్లిమెంట్‌లు వేస్తాయి. అవిఇచ్చేవి సలహాలుకావు ఆజ్ఞలు అన్నమాట. ముఖ్యంగా వోగ్ లాంటి పత్రికలు మరీను నువ్వు ఫలానా ఫలానా రంగులలో ఫలానా ఫలానా రకాలబట్టలు వేసుకోవలెను ఫలానా పద్ధతిలో టోపీ పెట్టుకోవలెను ఇదిగో ఇలా జుట్టు కత్తిరించుకోవలెను ఈ రకంగా ఉంటాయి సలహాలు

మెట్రోపాలిటన్ నగరాలలోని మహిళలు, యువతులు, బాలలూ వాటిని శిరసా వహిస్తారు. మనదేశంలో చాలామంది మొగస్టూడెంట్లలాగే, పీమ దేశాలలో ఆడపిల్లలకి గూడా, నిశ్చితాభిప్రాయాలు ఉన్నట్లు కనబడదు

ముఖ్యంగా కాలేజీపిల్లల కోసరం, ఆగస్టు ఆగస్టుకి వచ్చే సప్లిమెంట్‌లు తలోదారిగా సలహాలిచ్చినపుడు ఏది ఫాషన్ ఏదికాదు అన్న విషయంమీద లేచేగోల ఇంతా అంతా కాదట ఒక పత్రిక "ఓఅమ్మాయీ! నీకు కన్ను చెదరగొట్టే రంగులలో గుడ్డలు చాలా బాగుంటాయి" అని ప్రకటించి ఆ పైన కొన్ని కలర్ కాంబినేషన్‌లు సూచిస్తుంది

"ధగధగ లౌడ్ కలర్సు (కన్ను చెదిరే రంగులు) అస్సలు పనికిరావు" అంటుంది ఇంకో పత్రిక "నీ చదువుకి, నీ సంస్కారానికీ నిరాడంబరంగా కనపడే దుస్తులు ఒప్పుతాయి కాబట్టి ఓ సుందరాంగీ, లేత రంగు నే వాడుము" అంటుంది ఇంకో పత్రిక

కన్ను చెదరగొట్టే రంగులు కూడదు కాక, కంటికి నదరుగామాత్రం ఉండాలి అంటుంది ఇంకొక పత్రిక

"అసలు ఫాషన్‌గురించి గట్టిగా తెలిసినవారి అభిప్రాయ మేమిటంటే ......" అంటుంది ఇంకోటి పత్రిక అభిప్రాయం మధ్యరకం అన్నమాట సగం ఇటూ సగం అటూ ఉండడం విశేషం అంటుంది

చివరికి ఈగోలలో నలిగిపోయేవాళ్ళు ఏ వారితోచక విస్తుపోయేవాళ్ళు, చదువుకున్న ఆడపిల్లలు తికమకపడతారు వాదించుకుంటారు ఒకరకం గుడ్డలు కొంటారు మర్నాడవి ఒద్దుపొమ్మంటారు

అందువల్ల ఈ కలర్ కాంబినేషన్‌లకి, ఈ ఫాషన్ ధర్మసూత్రాలకి గీటురాయి ఏమిటి? అసలు పద్ధతి, బేసిస్, ఏమిటి అన్న విషయం తెలుసుకో బుద్ధేస్తుంది నాకు ముఖ్యంగా, ఇలాటివంటే వళ్ళుమంట సంగతేమిటో తెలుసుకుంటేగాని నిద్రపట్టదు

మెద్రాసులో చాలామందిని అడిగాను అలాగే ఒకసారి బొంబాయివెళ్ళినప్పుడు అక్కడపరిచయం ఆయన కొద్దిమందిని అడిగిచూశాను

ముందరవాళ్ళు కొంచెం షాక్ తిన్నట్టయారనుకోండి ఫాషన్ గురించిన సలహాల విషయంలో ఎందుకు, ఎలాగ అని అడగకూడదు అవిఒకరు అడగరాదు ఇంకోళ్ళు చెప్పరదట అలా అడిగితే మేనర్స్ లేవన్నమాట

మేనర్స్ లేకపోతే అడేపోయె అని నేను ఎందరినో అడిగాను కొందరే సరిగ్గా జవాబు చెప్పారు సరిగ్గా అంటే నాకు అర్థం అయేలా నాకు నచ్చేలా

నేను తెలుసుకున్న దాన్నిబట్టి ఫాషన్ రెండు విధాలని తేలింది ఒకటి బుకాయించి, బాగుందని ఒప్పించే పద్ధతి రెండోది, మనిషి విగ్రహానికి, మొహంలో కళాకళలకి సరిగ్గా తగినట్టుగా ఉండేది ఉన్న అందాన్ని, దర్జానీ మరింత ఎక్కువ చేసేదీను

సన్నటి పిల్లలు, కొన్నాంగదా అని ఎనిమిదిగజాల బనారసు చీరెని చుట్టబెట్టుకుంటే ఘోరంగా ఉంటుంది బుట్టబొమ్మల్లా ఉంటారు

ఉన్న వయస్సుని కాస్త తగ్గించి, ఇంకా చిన్నవాళ్ళలా, చక్కగా కనబడదాం అని, కొంచెం భారీ శరీరం వాళ్లు ఆరుగజాల చీరెలో అర్ధగజంకత్తిరించి, ఐదున్నరగజాలు సర్దుకుంటే, ఆసౌకర్యం చెప్పనక్కరలేదు

రంగుల విషయముకూడా అంతే మామూలుగా రోజూ కాలేజీకి వెళ్ళడానికి, సన్నటి మెత్తటిచీరెలు, మేలిరంగులవి కట్టుకుని, మరీ ముదర, మరీ లేత కాకుండా, ఒక్క ఛాయ నదరుగా కనబడే చోళీ వేసుకుంటే బాగుంటుంది

ఎర్రటి ఎగపురంగు చీరెకి, చీకటంటి కాటుకలాటి చోళీ కొందరు వేసుకోగా చూశాను

ఏం వేసుకుంటే ఫస్టుగా ఉందన్నారు వాళ్లు నామటుకు నాకు, నాలాటివాళ్ళకి, సెకండుక్లాసు గాకూడా కనబడలేదు.

ఈమధ్య 'సీమ' అనే హిందీ చిత్రం వచ్చింది అందులో నూతన్ సమర్థ తెల్లటి చీరె చోళీ కట్టుకుంది ఆ డ్రెస్, ఆ విగ్రహానికి అద్భుతంగా నప్పింది ఒంటిని పెట్టుకున్నట్లుంటుంది

అలాగే 1955 లో అమెరికన్ సినిమాలో బెస్ట్ డ్రెస్ డిజైన్ బహుమతి "లవ్ ఈజ్ ఎ మెనీ స్ప్లెండర్డ్ తింగ్" లో జెనిఫర్ జోన్స్ వేసుకున్న కాస్ట్యూమ్‌కు లభించింది గాను ఫాషన్ల మీద నాకు ఇంటరెస్ట్ లేకపోయినా ఆ సినిమాలో ఆ డ్రెస్ చూస్తూవుంటే, చాలా బాగుందనిపించింది.

★

# కొరమాలిన వస్తువు

కొరమాలినవస్తు వనేది ఈ ప్రపంచకంలో ఎక్కడా లేదు అటువంటిదానికోసం వెదకబోవడం వృథా అనే కొరమాలిన పని దానికి సిద్ధపడే మనిషే కొరమాలిన జీవి

ఒక కథ ఉంది వెనకటి కొకరాజు ఇలాటి పని తలపెట్టాడట ఒకరోజున అతడు మంత్రిని పిల్చి ఓ మంత్రీ! కొరమాలిన వస్తు వేదైనా ఉందీ అన్నాడుట

ఓ రాజా! ఈ లోకంలో అసలు కొరమాలినవస్తువు అనేది లేదుసుమీ అన్నాడు మంత్రి వస చూపిస్తా అన్నారు రాజావారు ఇద్దరూ బయలుదేరారు ఊరిమీదికి రాజాగారు, తన బుర్రలో ఉన్న తెలివితేటలు అన్నిటినీ ఉపయోగించేసి అల్లదిగో ఇలిదిగో అంటూ కొరమాలినవస్తువులను చూపించడం మొదలెట్టాడు అయితేనేం అన్ని కథల్లోనూ రాజులకన్న మంత్రులకే తెలివితేటలు మహాలావు రాజాగారు పనికిరాదన్న ప్రతి వస్తువుకీ మంత్రి ఇట్టే ఓ ఉపయోగం చెప్పేశాడు

చివర కేమైందంటే, ఓ చెరువొడ్డున ఓ మనిషి ఓ చెరుకుగడ తింటున్నాడు రాజాగారు వాణ్ణి చూడగానే గభీమని ఓ దమ్ముకు గుమికి అల్లదిగోనోయ్ మంత్రీ కొరమాలినవస్తు వన్నారు. ఒక్క ఘడియ ఆగండి అన్నాడు మంత్రి రాజావారితో అంతలోనే చెరువుగట్టుమీది అబ్బి ఆ చెరుకుపిప్పిని తినూషాగా అదో హాస్తరుగా పాపుచేసి మడతపెట్టి ఒకలా చేశాడు కుటుమిమను దుకాణంలో మిగిలే రంగురంగుల సుద్దపీలికలు నాలుగు తెచ్చి తీసి, ఆ చెరుకుపిప్పికి చుట్టబెట్టాడు అది ఇట్టే చిలక బొమ్మ అయిపోయింది ఆ అబ్బి దాన్ని తిన్నగా రాజుకే చూపించి అరకాణీకి అమ్మేశాడు (అర్ధకాణీలు ఇప్పుడు లేవను కోండి అప్పుడు)

అప్పటికి రాజావారికి సంగతి బోధపడింది

ఇలాగే దేనికైనా మనం ఒక ఉపయోగం కనిపెట్టవచ్చును మాటవరసకి, చిరిగిపోయిన చీరె లున్నాయనుకోండి వాటిని ఓ మూల ఎడ్జింకన్న చక్కగా అంచులూ అవీ గింపేసి వాటిని కప్పడానికి చేతనైతే లేపో లేపోతే ఇంకో బోర్డరో వేసేసి, (అదీ కాపోతే ఉత్తిదే సన్నంగా మడతపెట్టి టాకాలు వేసుకున్నా వేసోవచ్చు),



అఖిలభారత ఆహారవ్యవహారాల మహిళామండలి సహాయార్థం జరిగిన 'కార్నివల్'లో ఈ సాత్విక నృత్యప్రదర్శన మిచ్చిన నటి రాజ సులోచన గవర్నరు శ్రీ శ్రీప్రకాశ ప్రభృతులు ఈ నృత్యానికి హాజరయ్యారు

# ★ అట్లతద్దోయ్! ఆరట్లోయ్!! ★

(29 వ పేజీ తరువాయి)

ఓహో అన్నారంతా ఔరా అన్నారంతా

ఆ చిన్నది ఆతరువాత శ్రద్ధాభక్తులతో ఆ నోము పదేళ్లు నోచి, అపచారం లవలేశం లేకుండా ఉద్యాపన చేసుకుంది. ఆమె నోచిన నోము నే అందరూ నోచారు ..

అట్ల తదియ ప్రతి ఏటా ఆశ్వయుజ బహుళ తదియ నాడు వస్తుంది.

కన్నె పడుచులూ ముత్తయిదువలూ కూడా ఐదోతనం కోసం ఆ నోము పడతారు. ఆ రోజు తెల్లవారు ఝామునే లేచి వేడన్నం, వేపడం, నూలుపొడుం, లేదా కందిపొడుం, మూకుడు పులుసూ, తోడు పెరుగూ వేసుకుని, అచ్చట్లూ ముచ్చట్లూ ఆడుకుంటూ అరగిస్తారు. ఆ పైన తాంబూలం వేసుకుని ఆటలాడ బోతారు. వీధుల్లో ఆడుకోవడం గగనమే అనుకోండి. ఊళ్లో అల్లరి సజ్జంతా పల్లేరుకాయలూ సరంజామా పట్టుకు తిరుగుతూ ఉంటుందేమో, ఆడపిల్లలు బహు జాగర్తగా ఉంటారు. ఆ రోజున ఊళ్లో పోకిరీ సజ్జుపని పైరు పచ్చగా ఉంటుంది పట్టపగ్గా లుండవు మంగలి కొట్టు బోర్డు పీకి డాక్టరుగారి యింటికి తగిలించేసే వాళ్లూ, పెంకె ఘటాల్ని మంచాల పళంగా శ్మశానానికి మోసేసేవాళ్లూ—వాళ్ళ అల్లరి చెప్ప తరంగాదు

సరే ఈ ఆడపిల్లలు ఇలా పెరళ్ళలోనూ తోటల్లోను ఆడుకుంటారు

తెల్లగా తెల్లారేక, తలంటి పోసుకుని ముస్తాబై, గుళ్లో పాలో, పళ్లో పుచ్చుకుని తాంబూలం వేసుకుంటారు సాయంత్రం పూజయేవరకూ అన్నంమాత్రం తినకూడదు పళ్ళూ పాలూ పుచ్చుకోవచ్చు. పూర్తిగా ఉపోషం ఉంటారు కొందరు

సాయంత్రంలోగా కనీసం ఏడు తాంబూలాలు వేసుకోవాలి ఏడు చోట్ల కెళ్ళి ఉయ్యాల లూగిరావాలి. ఉయ్యాలాల దగ్గిర ఇంక కయ్యాలు చెప్పతరంగాదు ఉత్తుత్తి కయ్యాలే అనుకోండి.

ఇంక ఉయ్యాల ఎక్కాక, పెళ్ళయిన పిల్ల అయితే, మొగుడి పేరు గట్టిగా చెప్పే వరకూ, ఉక్కిరి బిక్కిరై పోయేలా ఊచేస్తారు ఆపమని మొత్తుకున్నా ఆపరు

సందెవేళ దీపాలు పెట్టాక స్నానంచేసి తులసి కోటకి పూజ చెయ్యాలి. అప్పుడు అట్లుపోసి, తిమ్మనంచేసి చంద్రోదయం కాగానే నైవేద్య పెట్టాక తరవాత దండనాలు పెట్టాలి అప్పుడు ఈ పాటపాడుతారు

దైవ దండ నా దేవ
    దండనా కలిగి ఉండాలి
తల్లి దండనా, తండ్రి
    దండనా కలిగి ఉండాలి
భర్త దండనా, పుత్ర దండనా
    కలిగి ఉండాలి
వెయ్యేళ్లాయువు, ఐదో
    తనమూ కలిగి ఉండాలి

రెండు చేతులా పిడికెడేసి బియ్యంపట్టి, కుడిపిడికిలి ఎడంవేపుకి, ఎడమ పిడికిలి కుడివేపు వచ్చేలా ఓ చెయ్యిమీద ఇంకో చెయ్యి పెట్టి ఒక్కొక్క చరణం పాటగానే ఆ బియ్యం క్రింద పోసెయ్యాలి మళ్లీ మరోపిడికెడేసి బియ్యం తీసుకోవాలి ఇలా దండనాలయ్యాక బ్రాహ్మణికి ఆబియ్యం, తాంబూలం దక్షిణ ఇచ్చి దండం పెట్టాలి. తరవాత పదకొండు మంది ముత్తైదువల్ని పిలిచి పదకొండేసి అట్లు, తాంబూలాలు వాయనం ఇవ్వాలి అప్పుడు నోము నోచేవారు కథ చెప్పుకొని, అక్షింతలు వేసుకొని, అట్లుతిని, తాంబూలం వేసుకోవాలి ఇలా పదేళ్లు చేశాక పదకొండో ఏట ఉద్యాపన చేసుకోవాలి

ఆ ఏడాది విదియనాడు పదకొండుగురు ముత్తైదువులకు తలంటి నీళ్లు పోయించాలి తదియ నాడు తెల్లవారకుండా వంటచేసి వారికి భోజనం పెట్టాలి మధ్యాహ్నం బ్రాహ్మణుడిని సత్కరించాలి. చంద్రోదయం అయిన తరువాత పదకొండుగురు ముత్తైదువలకు పదకొండేసి అట్లూ, పళ్లూ, రవికెల గుడ్డ, తాంబూలం పెట్టి వాయనం ఇవ్వాలి మరో వాయనం మీద పన్నెండు పిండికుండల్లో జ్యోతులు వెలిగించి, చంద్రుడికి చూపించాలి ఆ తరువాత కథ చెప్పుకొని, (పైన చెప్పినది,) బ్రాహ్మడికి దక్షిణ తాంబూలాలిచ్చి ఆపైన భోజనం చెయ్యాలి. ఈ ఉద్యాపన తదియనాడు చేసుకో వీలు లేక పోతే కొందరు పెళ్ళిళ్లు జరిగే నప్పుడు చేసుకొంటారు.

అట్లతద్దోయ్
    ఆరట్లోయ్
    ముద్దపప్పోయ్
    మూడట్లోయ్ ★

మంజులూరి పర్వతవర్ధని.

# కొరమాలిన వస్తువు

డోర్ కర్టెన్లుగా చేసుకోవచ్చు. మరీ బొత్తిగా అంతపెద్ద కర్టెన్లకి సరిపడకపోతే కిటికీలకి కర్టెన్లు చేసుకోవచ్చు ఇవి బాగుంటాయి మీకు చేతనొస్తే మంచి యెంబ్రాయిడరీ డిజైన్ వేసుకోవచ్చు

ఇంకోటి. అవి చిరిగిపోతే, మళ్లా ఆ లేసులూ అవీ తీసి జాగర్త చెయ్యొచ్చు మరో దానికి వాడడానికి ఇలా వద్దనుకుంటే ఇంకోలా చేస్తే సరి. చక్కగా, నాలుగేసి పాతచీరలు కలిపితే, మంచి ఒత్తుగా బొంత కుట్టుకోవచ్చు పది రూపాయలిస్తే కొత్త చీరొచ్చేగాని, లక్ష గుమ్మరించినా పాత గుడ్డ దొరకదంటారు

ఇలాగే ఇంకోటి మాటవరసకి చెప్తున్నాను విరిగిపోయిన గంటెకాడ ఒకటి ఉందనుకోండి. పనికిరాదనేవాళ్లు పారేస్తారు అలాకాదు అనుకున్నవాళ్లు, ఏ వంటింటి తూముల్లోనో తుక్కు చేరితే, తొయ్యడానికి వాడుతారు అలాటిదే ఇంకో గంటె విరిగితే అప్పుడేంచేస్తారు?

సమంగా ఈలాటి ప్రశ్న వేస్తే మా తోటికోడలాకావిడ ఇంకో గంటె ఉంటే ఇంకోతూముకోసం వాడుకోవచ్చునని సులువుగా జవాబు చెప్పింది

ఇది వింటె ఒక కథ జ్ఞాపకం వస్తుంది ఒకడు పందుల్ని పెంచుతున్నాడుట ఆ పందులదొడ్డి గోడకి వాడు ఒక పెద్ద గుమ్మం, ఒక చిన్న గుమ్మంకూడా పెట్టించాడు ఎందుకురా అబ్బి రెండు గుమ్మాలని వాటికి చిన్నగుమ్మమూను అని చెప్పాడుట అడిగితే, పెదవాటికి పెద్ద గుమ్మం, చిన్న

ఇంతకీ ఆ రెండో గంటెని ఎలా వాడచ్చును? మా పిల్లలు ఏంచేశారో చెప్తాను ఆ గంటెకాడకి ఈతాకులతో గట్టిగా తొడుగులాటిది అల్లేరు ఈ చివర ఓ ఎర్రటి గుడ్డ పేలికని పటకాలా చుట్టేరు. మరోకొసని, దర్జీ దుకాణంలోంచి తెచ్చిన సన్నపాటి గుడ్డపేలికలతో కుచ్చులాటిది కట్టారు దాంతో అలమారాలూ, బల్లలూ అవీ చక్కగా దులుపుకోవచ్చు క్రముక్క కాదు కాబట్టి అది అలా పడుంటుంది

నేను మొన్న ఇలాగే ఈ సంగతి చెప్తూంటే ఓ పదేళ్ల కుంటడు, విరిగిపోయిన సూదిముక్కని ఏంచేస్తారండీ అక్కగారూ అన్నాడు ఉత్తి కొంటెతనం కొద్దీ.

నాకేంజవాబుతోచలేదు కాని, అక్కడే ఉన్న మరోపిల్ల మంచి తెలివిగా చెప్పింది "విరిగిపోయిన సూది కాలులో గుచ్చుకుంటే నెప్పిపెడుతుంది తమ్ముడూ, అందుచేత, ఆ నెప్పి తప్పించుకోవడంకోసరం, ఆ సూదిని వీధిలో పారెయ్యాలి, అదీ తమ్ముడూ, విరిగిపోయిన సూదిముక్క అందుకూ పనికొస్తుంది" అని చురుగ్గా చెప్పేసింది ★

ఎస్. సుబ్బులక్ష్మి, శ్రీకాకుళం.

# సినిమా

## ఆనందావారి 'మేలుపలుకు'

"కాని గొప్పలకు పోయేవారికి ఓటమి తప్పదని" మేలుపలుకు పలుగెత్తి తెలియచెప్పడం ఆనందావారి "మేలుకొలుపు" చిత్రంలో ప్రధాన కథాంశం. నిజానికిందులో అప్రధానమైన అంశాలు, పనిలో పనిగా చెప్పేనీతులూ ఆట్టేలేవు. కథ లక్షణంగా సూటిగానే వెళ్ళిపోతుంది. ఎటొచ్చీ దారి కొత్త వలిగినది. దుష్టుడైన ఫాక్టరీ మానేజరు, కన్నెపడుచు గొంతు కోసిన వకీలిరోమియో, ఒక చెరసాల, అందులోపడ్డ కథానాయకుడి మాసినగడ్డం, నీలాపనిందలపాలైన ఇల్లాలిమీద జాలిపడమనే నేపథ్యగీతాలు, ఆ పైన కష్టాలు, సహనం, కొన్ని సినిమాకష్టాలు, మళ్ళీ సహనం, నేపథ్యగీతం మొదలైన సినిమాకథ హంగులన్నీ ఉన్నాయి. వాటితోపాటు, నిత్యజీవితంలో మనకి కనపడే మనుషులు, సజీవంగా, చైతన్యస్ఫూర్తియుతంగా కనబడతారు. నేపథ్యగీతాలు ప్రసక్తిలేకుండానే, మన మనఃపూర్వకమైన సానుభూతిని సంపాదించుకొంటారు. అభినయపాత్రులు, అవునూ ఈ చిత్రంలో మొత్తంమీద, మొదట [illegible] న్న జాబితాలో పాత్రలకన్న వీళ్ళే [illegible] వాళ్ళకన్న వీళ్ళకే ఎక్కువబలం [illegible] ర్షణ ఉంది. సినిమా మార్కు [illegible] మామూలు కపాలే కొట్టొచ్చినట్టు కనబడతాయి. కనబడి చెప్పదలచిన సంగతి గట్టిగా తెలియచెబుతాయి. వివిధ పాత్రలు సహజంగా రూపొందాయి. సహజంగానే నవ్వుతాయి ఏడుస్తాయి, మాట్లాడుతాయి పోట్లాడుతాయి. మంచీ చెడ్డాఅని రెండుతో ఫ్రీళని భాగించలేము. మొత్తంమీద. ఉవిరంగా ఈ చిత్రం రాణించడానికి కథకన్న, పాత్రచిత్రణ, వాటి నిర్వహణ ఎక్కువ దోహదం చేశాయి.

కొలువా చెయ్యక సల్లంఘన్నా, కష్టం అంటే బొత్తిగా ఇష్టంలేని మధ్యతరగతి కుటుంబం, పోలేదు ఇష్టం ఉన్న ఖంట్రోళు కుటుంబం ఈ కథని నడిపించాయి. ఒకటో తారీఖు ఖంట్రోళు ఇంటికి ఖులాసాగా వస్తుంది. గుమాస్తా ఇంటికిమాత్రం భీభత్సంగా వస్తుంది.



"మేలుకొలుపు" లో జి. వరలక్ష్మి

## "రాజనందిని"

జయహోవారి తొలిచిత్రం "రాజనందిని"కి ఇటీవలే ప్రారంభోత్సవం జరిగింది అక్టోబరు 6వ తేదీన భరణీస్టుడియోలో, మొదటి పాటను రికార్డు చేశారు శ్రీమతి సుశీల ఆ పాట పాడింది శ్రీ టి వి రాజు ("జయసింహ") శ్రీ ప్రకాష్ ఈ చిత్రానికి సంగీత దర్శకులు కథ మాటలు పాటలు శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి వ్రాస్తున్నారు శ్రీ వేదాంతం రాఘవయ్య దర్శకత్వం నిర్వహిస్తున్నారు కెమెరా రేహమాన్

ఇప్పటికి అంజలి ఎన్ టి రామారావు రేలంగి బుక్ అయ్యారని నిర్మాత శ్రీ మిద్దె జగన్నాథరావు (విజయవాడ) చెప్పారు

ఒకటి రెండు రిహార్సల్స్ జరుగగానే, టేకుకు సర్వం సిద్ధం చేశారు

సుశీల పాట పాడింది భరణీ రికార్డిస్టు శ్రీ కోటేశ్వరరావు పాట రికార్డు చేశారు పరస్పర అభినందనల సందర్భంలో ఫ్లాష్ కెమెరాలు చురుకుగా పని చేశాయి. ఒక ఫొటోగ్రాఫర్ సుశీలని పోజ్ చెయ్యమన్నారు

"పాడుతున్నట్టా, నవ్వుతున్నట్టా?" అంది సుశీల నవ్వుతూ అప్పటికే ఆమె పాడుతున్నటు మాటాడుతూ ఉండగా ఒకసారి ప్రశ్న వేసినవ్వుతూ ఉండగా ఒకసారి కెమెరా ఫ్లాష్‌లు తళుక్కుమన్నాయి ★



"వరుడు కావాలి" లో భానుమతి

## ★ ఆనందా వారి "మేలుకొలుపు" ★

కారణం సువిదితమే ఈ మధ్యతరగతి ఇంట్లో ఒక హోటేలు కథనే వ్యంగ్యంగా చిత్రించారు పరువుకోసం అప్పులబరువు మోసే మధ్యతరగతి ఎగువ కుటుంబాలకు ప్రతినిధిగా సి ఎస్ ఆర్ ఆంజనేయులు, అతనికి సమానాంతరంగా అయితే హాయిగా మంచిగా కాలంగడుపగల దివాలా ఎంప్లోయీగా లంక సత్యం అద్భుతంగా నటించారు

కాయకష్టంలో గౌరవాన్ని గొప్పతనాన్ని నిరూపించి తెలియచెప్పిన కోడలుగా జి వరలక్ష్మి ఆమె భర్తగా శ్రీరాం మంచి నటన హాతాదు మెచ్చని నటన ప్రదర్శించారు

విషాదాంత కథానాయకీ నాయకులుగా జమున నరసింహారావుల భూమికలు పాత మూసలో పోసి రూపొందించినవి

చిన్నదైనా ఆహ్లాదం కలిగించే జ్ఞాపకం ఉంచే భూమికలు దనిలవాడి నిర్వహించిన 'భార్యాదాసుడు', రమణారెడ్డి నిర్వహించిన ఆఫీస్ మానేజరు మిక్కిలి సేని రాధాకృష్ణమూర్తి పెరుమాళ్లు మాసర్ సుధాకర్, సుందరమ్మ లీలాబాయి, సి వరలక్ష్మి మొదలగు వారంతా కూడా చక్కగా నటించారు జగ్గయ్య, కొటూరి మోహన్ కె వి ఎస్ శర్మ గెస్ట్ ఆర్టిస్టులుగా పాల్గొన్నారు పాటలసాహిత్యం, సంగీతం చాలా బాగున్నాయి "మేలుకొలుపు" చిత్రం దర్శకులు శ్రీ కె ఎస్ ప్రకాశరావు శ్రీ లంకసత్యం రచన శ్రీ తాపీ ధర్మారావు శ్రీ శ్రీ సంగీతం శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు నృత్యాలు, శ్రీ వెంపటి సత్యం

ఛాయాగ్రహణం జాగీర్దార్ ప్రకాష్ చంద్రన్ శబ్దగ్రహణం రామచంద్రరావు ముకుందన్ సూర్యనారాయణ

తెలిసి తెలిసి నిద్రపోదలచిన, అందుకు అలవాటుపడిన మధ్యతరగతి కుటుంబాలు దలించకపోయినా తెలుసుకుని బాగా మెలగదలచేవారికి ఈ చిత్రంలో చిట్టచివర సి ఎస్ ఆర్ గారు గంభీరంగా బాగా గట్టిగా చెప్పిన మేలుపలుకులు, నిజంగా మేలుకొలుపులే తారస్థాయిలో అంత గట్టిగా అలా మంచీచెడా చెప్పి ఒప్పించగలగడం ఆయనకే చెల్లింది, ఒప్పింది

ఈ చిత్రాన్ని అక్టోబరు 11 న పత్రికలవారికి మద్రాసు పారగన్ టాకీస్‌లో చూపించారు ★

# సినిమాలో మానిసి

“కథలు రెండు విధాలు” అన్నాడొక సినిమాలో మానిసి

వాటిలో మొదటి రకం పేరు—కథలు. మామూలు కథలన్నమాట చెప్పదలచిన సంగతేమిటో ముందు తేల్చుకొని, ఆ పైన ఆ సంగతికోసం వ్రాసేవి

రెండవరకం సినిమాకథలు చెప్పతగిన సంగతులు అన్నీ ఈ కోవకిచెందిన ప్రతికథలోను ఉంటాయి చూపిస్తారు

వీటిలో ఏవి, ఎలా, ఎక్కడ, ఎప్పుడు వాడితే షాట్స్ పడిపోతాయో (కొప్స్ అని భావం) ఢంకామీద (అందుబాటులో ఉంటే) దెబ్బకొట్టి చెప్పే “బాక్సాఫీస్ అథారిటీ'లు పదిమందీ చేరి “స్క్రిప్టుమీద కూర్చుంటారు” సినిమా లక్షల ఖర్చుతో కూడినది కాబట్టి సాముదాయక కళగా బట్టి అందరూ, తలోమాటా చెప్పవలసిందే

చిక్కెక్కడంటే, చెప్పిన ప్రతిమాటా చెల్లవలసి రావడం అందరూ తమతమ దగ్గిర ఉన్న బాక్సాఫీస్ సూత్రాలని కథకీ అందులో ఘట్టాలకీ తగిలించి తలో వేపు లాగుతారు కథ ఉత్తరం, దక్షిణం, ఆగ్నేయ వాయవ్య మొదలైన దశ దిశాంతాలకూ వెళ్లి దిక్పాలకులను పలకరించి మళ్లా మామూలు రహదారిమీదకి దక్కా వస్తుంది మళ్ళా, గతుకుల సిమెంటు నేలమీద నీళ్ళకి మల్లే అటూ ఇటూ వెళ్లిపోతుంది

ఒకరోజు ప్రొద్దుట తూర్పున ప్రశాంతంగా ఉదయించిన సూర్యుడివంటి కథ ఈ విధంగా అన్ని వేపులా తిరిగి మర్నాడు సాయంత్రానికి పడమట గమ్యస్థానం చేరుతుంది ఇది నడిచే దారులు తయారుచేసే వాడే రచయిత ఇతన్ని కవిగారు అంటారు. బాక్సాఫీస్ సూత్రాలు తెలీని వాడు ఈయనొక్కడే

చలన చిత్రాలలో ‘ప్రేమ’ అన్న పదంలాగే నానాటికీ అర్థరహితం అయిపోతున్న మరోమాట ‘కవి’

పది పుస్తకాలు చదివినవాడని, పది రాశాడని, సపపత్తుల తేడా తెలుసుకుని, తెలుపు నలుపుల తేడా అంత స్పష్టంగా తేటతెల్లముగా తెలియజెప్ప గలడనీ నమ్మకం కుదిరిన మీదటే ఏ నిర్మాత అయినా మామూలుగా ఈ కవి అనేవాణ్ని బుక్ చేస్తాడు

అక్కడితో ఫుల్ స్టాప్ కథ ఎలా ఉండాలనే కాదు ఎలా నడవాలో ఏ మలుపులు తిరగాలో కవి డికేషన్ రాసుకుంటాడు ముగింపు ఎలా వుండాలో డిస్ట్రిబ్యూటర్ దగ్గర నేర్చుకుంటాడు.

## రచయిత

సంభావనల సౌలభ్యం మీద ప్రముఖ నటీనటుల నిశ్చితాభిప్రాయాలను కంఠతా వేసుకొన్నవాడవుతాడు ఈ మధ్యనే ఉత్తరాదిన పెద్దసైజు మాటినీ ఐడల్, సంభాషణలు ఎలా వుండాలన్న విషయమై తన అభిప్రాయాలను ప్రకటించాడు ఇది చాలా సబబయిన పని కాని ఆయన ఈ పనే సెట్స్ మీదకూడా చేస్తాడు కవి ఎలా రాసినా వాటిని నోట అనవలసిన వాడు నటుడే కాబట్టి, సౌలభ్యం గురించి, ఔచితి గురించి అసలు తన అభిప్రాయాలు చెప్పవచ్చు అయితే ఆ సంగతి కవికీ తెలుసును. ముఖ్యంగా, ఔచితి గురించి కవి ఎక్కువ శ్రద్ధగా ఆలోచిస్తాడు, ఎక్కువ జాగ్రత్తపడతాడు కథ పూర్తిగా చదవని, రిహోర్సలుకురా తీరుబాటులేని నటుడికన్న ఈ విషయంలో కవికే ఎక్కువ చెప్పడానికి అధికారం అవకాశం ఉండాలి కాని రెండూ లేవు హీరో వచ్చి “ఇది అబ్సర్డ్” అంటే వెంటనే అది అంతే అయి ఊరుకుంటుంది

ఈ కారణంవల్ల, చాలమంది రచయితలు, సాధ్యమైనంతవరకు సెట్స్ దగ్గరికి వెళ్లడం అంటె అమోఘంగా బోలెడు సరదాపడరు: తాము రాసిన నాలుగు వాక్యాలు పునః పునః చిత్రవధ కావడాన్ని సావధానంగా చూచి ఆనందించలేక ఈనాడు సినిమాకి రచనలు చేస్తున్నవారంతా గట్టిగా చదువుకున్నవాళ్లే సినిమాల ప్రమేయం లేకుండా



సాహిణీవారి “పెంకిపెళ్లాంలో” అన్నాచెల్లెల్లుగా ఎన్. టి. రామారావు, శ్రీరంజని.

# ★ సినిమాలో మానిసి ★

స్వయంగా పేరు ప్రతిష్ఠలు తెచ్చుకుని ప్రజల మన్ననలందుకున్నవాళ్ళే అయినా, వారు వ్రాసే వాక్యాలు "సైకలాజికల్ గా" కరెక్టు కావనీ, "పస" లేదనీ, సినిమా పెద్దలు తుణాంమీద తేల్చిపారేస్తారు ఒక్కొక్కసారి ఈ తీర్పులు మరీ ఘోరంగా ఉంటూ ఉంటాయి కొంతకాలం క్రితం ఒకసారి ఇలాగే ఒక డైలాగు హఠాత్తుగా వివాదాస్పదం అయిపోయింది

హీరో నవ్వుతూ "అరడజను మంది పిల్లలు" అనవలసి వచ్చింది ప్రేక్షకులతో పరిచితంగా ఆయన దాన్ని, అనవలసిన పద్ధతిలో తప్ప మిగతా అన్ని విధాలా అన్నాడు. కాల్ షీట్ టైము సురసుర కాలిపోతోంది

అ(ర)డ్డజనుమ్మంది పిల్లలు.. అరడజన్ మంద్ది పిల్లలు. ఇలా కొత్త కొత్త పంథాల్లో కూడా ఆయన చెప్పుకుపోసాగాడు తరవాత తలో కరూ తలో సలహా ఇచ్చారు. చివరకాయన, రెడీ ఫర్ టేక్ అనేసి,

'అరడజనుమంది పిల్లలు' అన్నాడు గంభీరంగా ఒకే స్థాయిలో

శాపం ఇస్తున్నట్టుంది తప్ప సరసంలా లేదన్నాడు నిర్మాత నెమ్మదిగా కాస్సేపాగి, "అరడజన్ను," అని ఆగి, "మందిపిల్లలు" అన్నాడు మళ్ళా కొత్త హుషారుతో. 'మందిపిల్ల' లేమిటి సార్ 'పందిపిల్ల'లన్నట్టు అన్నాడు నిర్మాత

"అసలీ డైలాగు బాగులేదండి మార్చెయ్యాలి" అన్నాడు హీరో చివరికి

అదృష్టవశాత్తు రచయిత అక్కడలేడు

ఇలాగే ఇంకోకాయన, చిన్న వేషధారి, అనుకోండి యజ్ఞము అనడానికి యగ్నము అనసాగాడు. ఫైనల్ టేక్ లో సరిగా అనేస్తా అని డైరెక్టరుకి హామీ ఇచ్చాడు ఆ తరవాత, ఇలాటిమాటలు జనానికి తెలుస్తాయా పాడా? అన్నాడు గంభీరంగా

తెలుగు, తమిళ, హిందీ చిత్రాలు పరిశీలిస్తే, ఉన్నంతలో చిన్న చిన్న సంభాషణలు, క్లుప్తంగా సూటిగా, తేలికగా వ్రాయడంలో తెలుగురచయితలదే అగ్రస్థానం అని చెప్పాలి హిందీవాళ్లు ఇప్పుడు బాగానయమే అయినా, కొన్ని చిత్రాల్లో ఇంకా, 'ఖాన్ దాన్ కే ఇజత్' మీద అనర్గళంగా ఉపన్యసించే నిన్నటి ధోరణి ఛాయలు కనబడుతునే ఉంటాయి తమిళ చిత్రసీమలో ఈనాడు ఉపన్యాసాలే వోగ్ లో ఉన్నాయి 'పొడుగు పొడుగుమాటలూ' బోలెడన్ని మాటలూ పోగుచేసి సాగదీసి చేసిన డైలాగులూ' అన్నాడొకాయన. పేలవఅని కాదుకాని, వాళ్ళకి నాటక రంగ ప్రభావం ఇంకా పూర్తిగాపోలేదు.

ఈ పొడుగు డైలాగులకితోడు వాటినిండా యతులకితాలుంటాయి. అవిఎన్ని ఉంటే అంత గొప్పరచయిత.

ఈవిధంగా వాళ్ళకన్న మెరుగు అనే కాకుండా, మనమటుకు మన రచయితలు తేలికగా సూటిగా, వ్రాస్తారన్న విషయాన్నెవరూ కాదనలేరు అయినా, వాటిని త్రోసిరాజనడం జరుగుతూనే ఉంటుంది ఈపరిస్థితులు ప్రతిచోటా



విక్రమ్ వారి "భక్తమార్కండేయ"లో మరుద్వతి, మార్కండేయుడు (పుష్పవల్లి కుమారుడు మాస్టర్ బాబ్జి.

ఉండి తీరుతున్నాయని చెప్పటంలేదు కాని, ఈ నాటి ధోరణి ఇలా సాగితే ఈ పరిస్థితులు సర్వత్రా ప్రబలిగల్లవు ఇదినిజంగా అవాంఛనీయం నిజానికి రచయితలు ఇవన్నీ తట్టుకోవడానికి సిద్ధపడే ఉన్నారు అలవాటు అయిపోతుంది చివరకి విసుగెత్తి ఖాతరు చెయ్యరు అయినంత మాత్రాన బాక్సాఫీస్ సూత్రధారులు చెలరేగాలని నియమింలేదు అయినా జరుగుతునే ఉంది ఈసూత్రాధారీటీల అధారిటీని కాదని రచయిత మాటను గౌరవించి అతని మాటను మన్నించి నిలబెట్టిన ధైర్యవంతులైన దర్శకులు నిర్మాతలూ అక్కడక్కడ అప్పుడప్పుడు లేకపోలేదు

కొండొకచో ఇది బిజినెస్ టాక్టిక్స్ అన్న శీర్షిక క్రింద అములు జరుగుతాయి.

"ఏమండీ ఈపాట చాలా కష్టంగా ఉందండి జనానికి తెలీదు" అంటాడు నిర్మాత

రచయిత అది కొట్టేసి అంతకన్న చాలా తేలికగా వ్రాసి ఇస్తాడు

"ఏముంది మనం అనుకునే మాటలేగా" అని తేల్చిపారేస్తాడు వ్యాపారదక్షుడు మున్ముందు ఇది పనికొస్తుంది

ఇంక డబ్బాదప్పుల విషయంలో, కొరు చవకబారు బేరం ఈ రచయితలదే ఉత్తరాదీన కొంత మెరుగు. దక్షిణాదివ ఉత్తరాది వారికి మంచిగిరాకీ వాళ్ళ మాటకి తిరుగులేదు కొన్నాళ్ళ క్రితం ఒక బాక్సాఫీస్ బొంబాయి ఫిలిం రచయిత హిరణ్యాక్షవరాలెక్కి మదరాసులో ఒక చిత్రానికి పాటరాయడానికి వచ్చాడు

ఇరవై రోజులయినా, పాట ఊడిపడలేదు.

"ఊటీ వెళ్తేగాని మూడ్ రాదండీ" అక్కడికి పంపే ఏర్పాటు కావించండి" అన్నాడా వరప్రసాదుడు చివరికి దక్షిణాది ఉన్నవారిలో తమిళ రచయితలకి ఇతర భాషల వారికన్న బాగానే ఇస్తారు ద్రవిడకజగం రచయితలది ఈ విషయంలో అగ్రతాంబూలం దాదాపు మాటకి వాలుగు రూపాయలు లేలుతుందనిపిస్తుంది తెలుగు రచయితలు ఈవిషయంలో జాబితా చివర ఉంటారు

ఇది మనదేశంలో పద్ధతి హాలీవుడ్ లో రచయితకీ ఇక్కడి వారిలాగే రచనల విషయంలో అన్యాయం జరిగినా, కనీసం డబ్బు అయినా తృప్తికరంగా లభిస్తుంది తప్పు తూర్పు యూరప్ దేశాలలో మాత్రం కథ వేరు అక్కడ రచయితలదే అగ్రస్థానం గౌరవం అందరికన్న-నటులకన్న ఎక్కువ వారికే ఇస్తారు ★

---

## సీ...నీ...మా:

కళాఖండానికి బాక్సాఫీస్ దర్శకుల నిర్వచనం సక్సెస్ ఫుల్ షో, అనగా విజయవంతంగా డబ్బుతీసగల చిత్రం.

దీనికి వినబడే జవాబు "బాక్సాఫీస్ హిట్ అంటే, ఎ క్లాస్ ట్రాష్, అనగా ఉత్త(మ) చెత్త చిత్రం అని భావం."



"ఆవారా షాహజాదీ" చిత్రంలో రాజ్ రాణి మీనాషోరీ

# బొంబాయి సినిమా లేఖ

బొంబాయి నగరంలోనూ, శివార్లలోనూ మొత్తం మరో ఏడు సినిమా థియేటర్లు నిర్మించడానికి అనుమతిస్తూ రాష్ట్రప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఈ వార్త ఫిలింరంగంలో వారందరికీ పట్టరాని ఉత్సాహం కలిగించింది. కొత్తగా విడుదలలు లేవటం అంటే ఈనాటి బాక్సాఫీస్ వసూళ్ళు రెట్టింపు అవుతాయన్న మాట. దాన్నిబట్టి, నిర్మాతలకు రావలసిన మొత్తం కూడా పెరుగుతుంది. దీనివల్ల జరుగబోయే మేళ్లలో అతి ముఖ్యమైనది, బ్లాక్ మార్కెట్ నిర్మూలనం. ఈ థియేటర్ల విషయంలో బ్లాక్ మార్కెట్ వర్తకాలు పట్టపగ్గాలు లేకుండా ఉంటున్నాయి. ముఖ్యంగా కొత్త సినిమాలు విడుదల చేసేవాటికి, అలంకారాలకీ ఆర్భాటాలకీ చాలా ఖర్చు అవుతుంది. యుద్ధానంతర కాలంలో గిరాకీ పెరగడంతో ఈ పద్దు క్రింద కాగల భారీఖర్చులన్నీ నిర్మాతలే భరించవలసిన పరిస్థితి ఏర్పడింది. ఏ నిర్మాత అయినాసరే ఈ పబ్లిసిటీ తొలిప్రదర్శన వ్యవహారానికి ప్రత్యేకంగా ఒక లక్ష రూపాయలు ప్రత్యేకం పట్టుకోకపోతే అతగాడి చిత్రానికి 'ఏ' తరగతి థియేటర్లలో విడుదల కాగలయోగ్యత లేనట్టే. అందులో చలనచిత్ర రాజధాని అయిన బొంబాయిలో తొలి విడుదలే ఆయా చిత్రాల భవిష్యత్తు తేల్చివేస్తుంది. అందువల్ల ప్రతి నిర్మాతా, ఈ కార్యక్రమం, ఎక్కడా లోపం లేకుండా సాగించడానికై విధిగా లక్ష రూపాయలు వేరే తీసిపెట్టుకోవలసి వస్తోంది. ఇప్పుడు నగరంలో సినిమాల సంఖ్య పెరిగితే ఉన్నవాటిలో రద్దీ గిరాకీ తరుగుతూ, హెచ్చు వ్యాపార వరాలూ సడలుతాయి. నిర్మాతకి ఇంతఖర్చులో కొంత తప్పుతుంది. ఈ విధంగానే మిగతా రాష్ట్రప్రభుత్వాలు కూడా రద్దీ ఉన్న నగరాలలో కొత్త థియేటర్లు నిర్మించడానికి అనుమతిస్తే, ప్రదర్శకులకు ఉపకారం చేసినట్టూ అవుతుంది, భారతీయ చిత్రాలకు ఇతోధిక స్థానం ఇచ్చి వసూళ్ళు పెరగడానికి ప్రోత్సాహం చేసినట్టూ అవుతుంది.

నిజానికి ఇప్పుడు ఇదో గడ్డు సమస్య. ఈనాడు ప్రత్యేకం విదేశీ చిత్రాలే చూపిస్తామని దీక్షాకంకణం కట్టుకు కూర్చున్న థియేటర్లలో కూడా—నానాటికీ పెరుగుతున్న సంఖ్య దృష్ట్యా భారతీయ చిత్రాల ప్రదర్శనకు స్థానం ఇవ్వడం అవసరం. గట్టిగా అడిగితే, ఆయా సినిమాలవారు తమ హక్కులను వక్కిస్తారు. వీళ్ళంత పట్టుదలతో అమెరికన్ చిత్రాలను వేస్తున్నా, అమెరికాలో మన చిత్రం ఒక్కదానికి కూడా విడుదలచేయడానికి అవకాశం లేకుండా అక్కడ కట్టుదిట్టాలున్నాయి. ఈరకం "వన్ వే ట్రాఫిక్" ఎవరికైనా ఆట్టే కాలం రుచించదు. ఈమధ్యనే ఈ "ఇంగ్లీషు సినిమా"లలో భారతీయ చిత్రాల విడుదలకు అప్పుడప్పుడు కొద్ది అవకాశం ఇచ్చే ధోరణి (పార్శియాజనూ నాట్యరవణి చేవి మినహా) కనబడుతోంది. రీగల్,

# ★ బొంబాయి సినిమా లేఖ ★

ఈరాస్, మెట్రో, ఎక్సెలిసియర్, న్యూ ఎంపైర్, పారిండ్‌లలో కొన్ని భారతీయ చిత్రాల 'ప్రీమియర్'లు జరిగాయి దీని బట్టి 1957 లో మన పరిశ్రమ పరిస్థితులు బాగా మెరుగు అవగలవని ఆశించవచ్చును

## కష్టః ఫలం

బహుమతులకు అర్హమైన చిత్రాల ఎన్నిక సంగతి అలా ఉంచగా, ఇచ్చిన వాటిలో, రాష్ట్రపతి సువర్ణపతక బహుమతి 'పథేర్ పాంచాలీ' దర్శకుడు శ్రీ సత్యజిత్ రాయ్‌కి ఇవ్వకుండా బెంగాల్ ప్రచార శాఖ డైరెక్టరుకు అందచేయడంచే సబబు అని ఇక్కడ అంతా విమర్శిస్తున్నారు బెంగాల్ ప్రభుత్వం ఈ చిత్రానికి పెట్టుబడి మాత్రమే సమకూర్చింది కాని ఈకళాఖండాన్ని సృష్టించినవాడు సత్యజిత్ రాయ్ ఈప్రకారం, ఆయా చిత్రాల నిర్మాణానికి డబ్బుపెట్టినవారికే ప్రభుత్వం ఈబహుమతులు ఇవ్వడం సాగిస్తే, అసలీ ఏర్పాటు ఉద్దేశ్యమే దెబ్బతిన్నట్లవుతుం దంటున్నారు

## సెన్సారు అభ్యంతరం

ఫిలింస్థాన్ వారు, బి మిత్రా దర్శకత్వాన కలకత్తాలో నిర్మించిన చిత్రం "దుర్గేశనందిని"కి సెన్సారు సంఘం కొన్ని గట్టి అభ్యంతరాలు తెలిపినందువల్ల ఈచిత్రం విడుదల వాయిదా పడింది ఆయా భాగాలను ఇప్పుడు తిరిగి 'షూట్' చేయవలసి వచ్చింది బంకించంద్ర చటర్జీ వ్రాసిన "దుర్గేశనందిని" నవల ఈచిత్రానికి ఆధారం బెంగాల్ ముస్లిం పాలకుల క్రింద ఉన్న కాలంలో, అక్కడి దేశభక్తులు రాజకీయ స్వాతంత్ర్యంకోసం సాగించిన ఉద్యమం, నాటి సైనికులు ఇందులో చిత్రించబడ్డాయి బంకించవల బెంగాల్‌లో ఇంటింటా ఉంటుంది నవలలోని దుర్గేశనందిని ప్రతి బెంగాలీ పూజిస్తాడు



కెంపరాజ్ "నలదమయంతి"
నాగయ్య, కాశీనాథ్

ఇపుడీచిత్రంలో ప్రధానపాత్ర దుర్గేశనందినిని చిత్రించిన విధాన్ని సెన్సారు వారు ఆమోదించలేదట

ఈచిత్రంలో బీనారాయ్, నళినీ జయవంత్, నిగర్ సుల్తానా, ప్రదీప్‌కుమార్, అజిత్ ప్రభృతి నటీనటులు పాల్గొన్నారు

## రేడియం జూబిలీ

రాజకమల్ కళామందిర్ వారి కళాఖండం "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" ఇక్కడ రేడియంజూబిలీ (బొంబాయినగరంలో వరుసగా 75 వారాల ప్రదర్శన) జరుపుకున్నది ఈసందర్భంలో ఇక్కడ ఒక గొప్ప థియేటరులో వరుసగా వారం రోజులపాటు, దిగ్గంతుల శాస్త్రీయ సంగీత సభలు ఏర్పాటు చేశారు వారంరోజులూ భవనం క్రిక్కిరిసి పోయింది 78 ఏళ్ళ వృద్ధు, బాలగంధర్వ అనురాగానం, 74 సంవత్సరాల వృద్ధు అహమద్ జాన్ తిరాక్వా తబ్లావాద్యం (ఈ ఇద్దరినీ రాష్ట్రపతి గడ సన్మానించడం విదితమే) వినే మహదవకాశం కలిగింది అలాగే బిస్మిల్లాఖాన్ బృందం శహనాయివాద్యం, హాకింజఫర్ సితార్, శరణ్ రాణి మధుర్ సరోద్ వాద్యాలు వినిపించారు. జర్కాతలీ ఖాఁ, ఉస్తాద్ నిజర్ హుస్సేన్, ఉస్తాద్ అమీర్ ఖాఁ, గంగుబాయ్‌హంగల్ ప్రభృతుల గానసభలు జరిగాయి ఈవిధంగా 75 వారాలు నడిచినందుకూ, ఈ గానసభలు జరిగినందుకుకూడా 'ఝనక్ ఝనక్ పాయల్ బాజే' చలనచిత్ర చరిత్రలో ప్రముఖ స్థానాన్ని సంపాదించుకుంది ఈ సభ ఏర్పాటుచేసిన సంగీతదర్శకుడు శ్రీ వసంత్ దేశాయ్ అభినందనీయుడు

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

* * *

## "జీవనయాత్ర"

కొత్తగా స్థాపింపబడిన చేతనా ఫిల్మ్స్ సంస్థవారు "జీవనయాత్ర" అనే చిత్రానికి విజయదశమినాడు ప్రారంభోత్సవం జరిపారు ప్రారంభోత్సవం వాహినీ స్టూడియోలో జరిగింది ఆరోజునే రెండు పాటలు కూడా రికార్డు చేశారు

ఈ చిత్రానికి శ్రీ కె ఎస్ ప్రకాశరావు దర్శకత్వం వహిస్తున్నారు కథ మాటలు, పాటలు శ్రీ అనిసెట్టి సుబ్బారావు వ్రాశారు కామెరా శ్రీలక్ష్మణ్ గోరె (ముద్దుబిడ్డ) సంగీతదర్శకుడు శ్రీరమేష్ నాయుడు

ప్రారంభోత్సవం నాడు రికార్డయిన రెండుపాటలూ వరమానగాయని సుశీల పాడినవి

* * *

## విశ్రాంతి విలువ

నటి నూతన్ సమర్థ నానాటికీ నూతన విజయాలను చేపడుతోంది. అమియ చక్రవర్తిచిత్రం "సీమ"లోను, ఫిలింస్తాన్ వారి "హీర్"లోనూ ఈమె నటన అందచందాలూ సర్వత్రా ప్రశంసలందుకున్నాయి ఎడతెరిపిలేని పనిఉన్న కొద్దిమంది తారలలో ఈనాడు నూతన్‌కూడా ఒకర్తె. అయితే ఎంతపనిఉన్నా, ఏది ఏమయినా, ఆరోగ్యపరిరక్షణ విషయంలో ఆమెకు మంచిపట్టుదల శ్రద్ధఉన్నాయి ఆమె, రాత్రిపూట సెట్స్‌కు వెళ్ళదు ఆదివారాలుకూడా అంతే ఇలా తప్పనిసరి నియమంగా విశ్రాంతి తీసుకోవడం ఆమె ముఖ్యనియమాలలో ఒకటి ఇపుడు నూతన్ పాల్గొంటున్న చిత్రాలలో సర్వత్రా ఎదురుచూస్తున్నది "బారిష్" ఇందులో ఈమె దేవానంద్‌తో నటిస్తోంది ఈ చిత్రానికి సంగీతదర్శకుడు సి రామచంద్ర శంకర్ ముఖర్జీ దర్శకుడు ఈయన, సుప్రసిద్ధ రచయిత, దర్శకుడు (సితారోంసేఆగే), అయిన గ్యాన్‌ముఖర్జీ తమ్ముడు.



### కారణం

"నిన్నరాత్రి దారుణమైన కల వచ్చింది!"

"ఏం దెయ్యాలు పలకరించి పరామర్శ చేశాయా?"

"ఛ ఛ దేవతల్లాంటి, అప్సరసలవంటి ఆడపిల్లలు ముగ్గురు ప్రత్యక్షమయ్యారు"

"ఇంకేం విశేషం వంటి కల"

"అసలు చిక్కేక్కడంటే, ఈ కలలో నేనూ ఒక అప్సరసనే అయి ఊరుకున్నా"



తిరువాన్కూరు సోదరీమణులు రాగిణి. లలిత, పద్మిని.

# 'పైసాహీ పైసా' చిత్రసమీక్ష

మెహబూబ్ ప్రొడక్షన్స్ వారి కొత్త 'కళాఖండం' మొన్న విడుదల అయింది కిశోర్ కుమార్, షకీలా, మాలాసిన్హా, రాధాకిషన్ జాల్ జలానీ, ముక్రీ, మురాద్ మొదలగువారు పాల్గొన్న ఈ చిత్రానికి మెహ్రీష్ దర్శకుడు అనిల్ బిశ్వాస్ సంగీత దర్శకుడు

మొరటు అనిపించే ఫార్సు చాపకు పన్ని వేళంతో ఇది ప్రారంభం అవుతుంది అయితే అయిందిలే అని ఊరుకోవచ్చు చిక్కెక్కడంటే దాని తరవాతదీ, ఆ తరవాతదీ, ఇలా వరసగా అన్నీ అలాగే ఉన్నాయి. కథకూడా మెడకలాగా వీటి మీదుగా దుముకుతూ అడంగిచేరబోతుంది అయితే, ఆ అడంగిఏమిటో, ఈ చలనచిత్ర నిర్మాతలు అక్కడ చెప్పదలచిన సంగతి ఏమిటో మాత్రం అంతుచిక్కదు కష్టపడి ఆరాలుతీస్తే 'నవీన వ్యాపార వ్యవహారంలో ప్రతి వారికీ, ధనాశ ఎక్కువనీ డబ్బుకోసం తమ కన్నబిడ్డల ప్రాణాలు ఒడ్డడానికైనా వా|| వెనకాడరని చెప్పడమే ఈనిర్మాతల ఉద్దేశంలాగ కనిపిస్తుంది

అల్లకల్లోలంగా ఉన్న ఈ చిత్రానికి ప్రయోజనం, లక్ష్యం అనేవి ఉంటే, అవి కాస్తా ఇందులో అసహజ, కృత్రిమ సన్నివేశాలవల్ల మరుగున పడిపోయాయి తీరు, తెన్నూ, సత్యం అసత్యం అని లేకుండా సమాజంలో ఒక వర్గాన్ని దుయ్యబట్టినట్టు అభినయించడం ద్వారా, సామాన్యప్రజల్ని నవ్వించి కవ్వించి బాక్సాఫీస్ విజయం సాధించడమే లక్ష్యం అన్న విషయం బాగా కనబడుతుంది ఈ ప్రకారం "పైసా హీ పైసా" కే పరమ ప్రయోజనం అయితే, నిర్మాతలు, ఇందులో పాల్గొన్నవారు ధీమాగా చెప్పుకుని కృతకృత్యుల మైనామనుకోవచ్చు ఎందుకంటే, నవ్వించే ఘట్టాలు ఇందులో కొల్లలుగా ఉన్నాయి అనిల్ బిశ్వాస్ సంగీతం చాలా [illegible]యిగా ఉంది. నృత్యాలు కూడా బాగానే ఉన్నాయికాని, సెట్స్ మాత్రం భీభత్సంగా ఉన్నాయి

(ఆంధ్ర వార పత్రిక బొంబాయి విలేఖరి)

**బొత్తిగా అంత కాళీయా!**

జనార్దనంగారి తల మీద ఎవరో ధనామని కొట్టి పారిపోయాడుట ఈ వార్తను పత్రికకి పంపుతూ ఒక విలేఖరి ఇలా వ్రాశాడు

"జనార్దనంగారిని వెంటనే ఆస్పత్రికి తీసుకు వెళ్లారు. అక్కడ వారి తలకాయను ఎక్స్‌రేలిస పరిశీలించారు అందులో ఏమీ కనబడలేదు"

## ★ విడని బంధం ★

(35 వ పేజీ తరువాయి)

జానకిరామయ్య ఈ సంబంధం చేసేస్తానని బట్టుబట్టి కూర్చున్నాడు

నిష్కళంకంగా ప్రేమించినబావను తను కనిపెట్టింది అలాంటిది నేను హృదయం లేని ఒక పశువుకు తన జీవితాన్నెలా అంకితం చేయటం?

సరోజ కాళ్లా వేళ్లా బడి ప్రతిమాలుకోగా జానకిరామయ్య మనసు కరిగి "సరే, ఈ సారి వచ్చే సంబంధం మాత్రం ఖాయం" అన్నాడు

* * *

ఆకాశం కేసి చూసింది సరోజ మబ్బు మబ్బుగా వుంది దారిలో వర్షంలో చిక్కుకుంటే తప్ప వాళు ఇంకో గడియకల్లా రానే వస్తారు గాలి జోరుగా వీస్తోంది వర్షం తేలిపోతుందేమో!

అవును! వరం తేలిపోయేటే వుంది! వాళ్లు తప్పకుండా వస్తారు! ఈలోపల తనకు 'చావు' రాకూడదూ?

సరోజ మనస్సులో నానాగందరగోళంగానూ వుంది పెను తుఫానులు చెలరేగుతున్నాయి - అగ్నిగోళాలు పగులుతున్నాయి

గతరాత్రంతా సరోజకు సరిగా నిద్రలేదు.

శారదత్తా, శేఖర్ కాశీనుంచివచ్చి అప్పుడే మూడు, నాలుగురోజులు కావస్తోంది అయినా తను ఇంతవరకూ వాళ్లింటికి వెళ్లటానికి సాహసించలేకపోయింది

ఆనాడు బావను ఈసడించి కొట్టిన తను బావలాంటి 'కుసుమా'నే వేలకువేలు పోసి తెచ్చుకుంటున్నది హృదయం ఇచ్చి ప్రేమిస్తానన్న బావను పరాభవించి పంపించేసింది ముక్కూ మొఖం తెలియని వ్యక్తికి తనజీవితాన్ని అప్పగించబోతున్నది ఉస్! ఏం జీవితం!

తనమనస్సువిరిగి తునాతునకలైపోయింది. పెళ్ళిమీదా లేదు, దేనిమీదా లేదు అయినా నాన్న వప్పుకోడు ఇంట్లోనుంచి ఎక్కడికన్నా పోవాలి! ఎక్కడికిపోయినా వెతికి తీసుకొచ్చి పెళ్ళి చేసేస్తాడు నాన్న.

చచ్చిపోతే నాన్నేం చేస్తాడు? ఆ- అదే చెయ్యాలి

వళ్లంతా మంటలు, మంటలు! శారదత్త ఇంటికివెళ్లి 'కాశీ' కబురు నాలుగువింటే వళ్ళా చల్లబడుతుందేమో! వద్దు, వద్దు- తను ఇంక ఎవరికీ తనముఖం చూపదలచుకోలేదు

ఎక్కడికో ఈడ్చుకుపోతున్నాయి కాళ్లు ఏది కనుపిస్తే అందులోనే దూకేస్తుంది. దాంతో సరి!

* * *

ఆకాశంలో మబ్బులు వెలుతురును అడ్డేసినయ్ అంతా మసకవెలుతురుగా వున్నది.

శారదమ్మ అలికిడిలేదు యెక్కడ 'పెత్తనం' చేయటానికి వెళ్ళిందో ఏమో!

ఆఫీసునుంచి వచ్చి ఇంట్లోకి అడుగు పెట్టబోతూ చైతన్యరహితంగా గోడను చేరగిలబడి నిలుచుని ఆ మసక వెలుతుర్లో అస్పష్టంగా కన్పిస్తున్న ఆకారాన్ని చూసి "ఎవరది?" అంటూ దగ్గరగా వెళ్లాడు శేఖర్.

తీరని వ్యథతోటి, చిత్తక్షోభతోటి భయంకరంగా పాలిపోయిన సరోజ ముఖం చూసి ఖంగారుపడుతూ "అరె! ఏమయింది సరోజా?" అని అడిగాడు శేఖర్

ఏమిటిది? ఏం చెయ్యాలనుకున్నది, ఎక్కడికొచ్చిందితను! శేఖర్‌ను ఏముఖంతో చూడగల్గుతున్నది.

సరోజకు గొంతుకలోంచి మాట పెగల్లేదు రెండు చేతులతో ముఖం కప్పుకుని నిశ్శబ్దంగా ఏడుస్తున్నది

"సరోజా!" అన్నాడు శేఖర్ మరింత కంగారుపడుతూ శేఖర్ కాళ్ళమీద కుప్ప కూలిపోయింది సరోజ"

అశ్రుతప్తాలైన కళ్ళను మెల్లగా పైకెత్తి శేఖర్ ముఖంలోకి చూస్తూ హీనస్వరంతో "నన్ను క్షమించగలవా బావా?" అంది

"శేఖరా! సరోజ గాని యిక్కడికొచ్చిందా? అవతల పెళ్ళి చూపులకొచ్చారు అదేమో ఎటో పోయిందీ!" అంటూ వీధిలో నుంచే కేకేశాడు జానకిరామయ్య గొడుగేసుకుని వస్తూ.

సరోజ హతాశురాలై, నిర్జీవంగా లేచి నిలబడింది "ఇంకా ఏం చూపులు మామయ్యా? అప్పుడే పాణిగ్రహణం కూడా అయిపోతేనూ!" అంటూ సరోజ చేయి పట్టుకుని శేఖర్ జానకి రామయ్య పాదాభివందనం చేయటానికి ముందుకొచ్చాడు ★

## ★ జూదాల పండుగ ★

(30 వ పేజీ తరువాయి)

గబగబలోనికివెళ్ళి తనకుపండిన పంటలో కొన్ని గింజలు మూటకట్టి, బజారుకు వెళ్ళేడు బజార్లో పసుపు, కుంకుమ, కొన్ని దుస్తులు తీసుకొని ఇంటికివచ్చాడు వాటిని నిన్నీ చేతికిచ్చాడు

"ఇవెందుకన్నయ్యా?" అని ప్రశ్నించింది నిన్నీ

"ఈ పేద అన్నయ్య పండుగపూట ఇంతకన్నా ఎక్కువకానుకలు చెల్లెలికివ్వలేడమ్మా పద! నీకోరకు సుబ్రో ఎదురు చూస్తుంటాడు" అన్నాడు

మైనా, నిన్నీకి కొద్దిగా పసుపురాసి, కుంకుమతో బొట్టుపెట్టి సాగనంపింది

నిన్నీ గంగాధర్ కలసి సుబ్రోఇంటికి వచ్చేటప్పటికి తలుపులు మూసిఉన్నాయి

"పాపం భార్య వెళ్ళిపోయిందని సుబ్రో ఎంత బాధపడుతున్నాడో?" అనుకున్నాడు గంగాధర్.

"సుబ్రో. సుబ్రో" అంటూ తలుపులు లోనికి నెట్టాడు

ఎదురుగా తనకు కన్పడిన దృశ్యం చూసి పట్టరానిదుఃఖంతో కళ్లుమూసుకొని వెనక్కి తిరిగాడు గంగాధర్

నిన్నీ అడుగు ముందుకువేసి గదిలోనికి వెళ్ళింది ఎదురుగా ఇంటివాసానికి వ్రేలాడుతున్న తన భర్తశవంచూసి కెవ్వున కేక వేసి క్రిందపడిపోయింది నిన్నీ

ఆ పండుగనాటిరాత్రి విందుగురించి ప్రత్యేకించిన కోడిపుంజు "కొక్కొరోకో" అని ఎన్నిసార్లు కేక వేసినా నిన్నీ మరి లేవలేదు ★

## సాగరగర్భంలో సాహసయాత్ర

(43 వ పేజీ తరువాయి)

గ్రామి బాగా పలికి దిగిపోయింది. మేమంతా బలక బయట పడ్డాము గదా అని ఒక్క పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాము తర్వాత జలాంతర గ్రామి మరి కొంతదూరం ప్రయాణం చేసింది. మా కందరికీ బాగా ఊపిరి పీల్చుకోవడానికి అవకాశం చిక్కింది.

ఇంకా వుంది.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street Madras 1 Editor S Sambhu Prasad



కూటి కొరకే....

—ఫొటో : ఎన్. రామకృష్ణ.




ఇప్పుడు...

రెక్సోనాలో

# లోగడగంటె చాల ఎక్కువ పరిమళము గలదు!